# గాంధీజీ కథలు

## రెండవ భాగము

సంపాదకురాలు:
శ్రీమతి వేముల శ్యామల
ఆనరరీ సూపరింటెండెంటు:
శ్రీ అంజనీదేవి హరిజన బాలికా వసతిగృహము
బెజవాడ.

ప్రకాశకులు:
హరిజన అండు కంపెనీ,
బెజవాడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడలో
హరిజన ముద్రాశాలలో
ముద్రింపబడినది.

**1938**



వెల రు. 0-5-0.

# సంపాదకీయ భూమిక.



విరామకాలములో గాంధిజీ జీవితములోని రమ్యఘట్టములను మా ఆశ్రమమునందలి హరిజన బాలికలకు ఆశ్రమ పండితులు కథలుగా చెప్పుచుండెడివారు. వానిని ముద్రింపవలయునని కొలఁదికాలమునుండి తలంచుచున్నను ఆశ్రమాదాయము చాల కొలఁది అగుటచే అట్టివీలు కలుగ లేదు. నేడు ఆశ్రమపోషకుల సాయముచేతను హరిజన ముద్రాశాల వారి తోడ్పాటుచేతను అందలి కొన్ని కథలను రెండు భాగములుగా ప్రచురింపగలిగినందులకు సంతసము కలుగుచున్నది.

ఈ ఆశ్రమములో జరిగిన బోధనల ఫలితముగా బాల బాలికల పఠనమునకు ఇవి చాల ఉపయోగకారులని చెప్పగలను. ఆంధ్రదేశములోని ప్రధానోపాధ్యాయులు, ఉపాధ్యాయులు విద్యాశాఖాధికారులు, వసతి గృహాధిపతులు, పిల్లల తల్లిదండ్రులు, పాఠశాలల మేనేజరులు, ఇంతయేల ఆంధ్రులెల్లరు ఈ కథలను బాల బాలికలచే చదివించి వారికి మేలుచేయుదురుగాక !

శ్రీ అంజనీదేవి ఆశ్రమము
25—10—1938.

వేముల శ్యామలాదేవి
హరిజన బాలికా వసతిగృహ గౌరవ అధ్యక్షురాలు.

# విషయసూచిక.



విషయము. పుట.


(1) ప్రిన్సుసును రాజకోటకు మార్చుట 1

(2) గాంధిజీ దక్షిణాఫ్రికాకు వెళ్ళుట 2

(3) గాంధిజీని రైలునుండి దింపివేయుట 4

(4) గాంధిజీని గుఱ్ఱపుబండిలో దెబ్బలు కొట్టుట 6

(5) మొదటి తరగతి రైలుబండిలో పరాభవము 8

(6) గాంధిజీ పోలీసువానిచే తన్నులు తినుట 10

(7) గాంధిజీ సేటుగారి వ్యాజ్యమును రాజీచేయుట 12

(8) వీడుకోలు విందు:ఎన్నిక హక్కుల పోరాటము 15

(9) గాంధిగారిని అడ్వొకేటుగా చేర్చుకొనరాదను పోరాటము 17

(10) నెటాలు కాంగ్రెసు స్థాపనము 19

(11) బాలసుందరము 21

(12) గాంధిజీ గిరిమిటియా పద్ధతితో పోరుట 24

(13) తలపన్ను పోరాటము 27

(14) పరాభవము 30

(15) గాంధిజీ కుటుంబ నిర్వాహణము 35

(16) స్టీమరు ప్రయాణము: ఇండియాలో దక్షిణాఫ్రికా సమస్యలనుగూర్చి ప్రచారము చేయుట 37

(17) "ప్లేగు" రోగ నిరోధము 39

(18) గాంధిజీ రాజభక్తి 42

(19) బొంబాయి సభ 42

(20) పునహాసభ 44

(21) మద్రాసు కలకత్తాల సంచారము 47

(22) తుపాను 52

(23) తెరచాటున కుట్రలు 55

(24) గాంధిజీ అహింసాప్రయోగ నిశ్చయము 58



# గాంధిజీ కథలు.

## రెండవ భాగము.

### 1 ప్రాక్టీసును రాజకోటకు మార్చుట.

గాంధిజీ బొంబాయిలో ప్రాక్టీసు చేయుచున్న రోజులలో ఒకరోజున ఒకదళారివచ్చి "వచ్చిన ఫీజులో కొంతభాగమును ఇచ్చినచో మీకు ఒక కేసును ఇచ్చెదను" అని చెప్పెను.

కాని దళారులకు ఫీజుఇచ్చుట దోషముఅని గాంధిగారి భావము. అందుచే అతఁడు "మీకు ఫీజులో భాగమును ఈయను" అనెను. ఆదళారి "నెలకు మూడు నాలుగువేల రూపాయలువచ్చు గొప్ప లాయరులుకూడ నాకుభాగమును ఇచ్చుచున్నారు మీరేల ఈయరు?" అని వాదించెను. కేసులు రాకపోయినను సరే నేను ఈయను అని గాంధిజీ చెప్పెను.

ఆ దళారికి భాగమును ఈయకున్నను ఆ కేసు యజమానురాలగు "మమీబాయి" కేసును గాంధిగారికే ఇచ్చెను. కేసు చిన్నది. అందుచే ముప్పదిరూపాయలు ఫీజు గాంధిజీ పుచ్చుకొనెను. కేసును బాగుగా చదివి కోర్టునకు వెళ్ళెను. కాని నోట మాటరాలేదు. కోర్టు గిఱ్ఱున తిరిగినట్లు కనబడెను. గుండెలు కొట్టుకొనుచుండెను. అక్కడ చేరిన

అనుభవముగల వకీళ్లకు అది వింతగా కన్పడుచుండెను. గాంధి గారికి చాల తలవంపుగా ఉండెను. కాని ఎంత ప్రయత్నము చేసినను నోట మాటరాకుండెను. అందుచే సిగ్గుచే తల వంచుకొని కొంతవడి అచ్చట కూరుచుండి వెంటనే వెలుపలికి వెళ్ళి ఆ కేసునకు చెందిన వారినిపిలిచి తనకు ఇచ్చినడబ్బును తిరిగి ఇచ్చివేసి వేఱొక లాయరును కుదుర్చుకొమ్మని చెప్పెను.

మఱియొక మహమ్మదీయుని కేసుకూడ గాంధిజీకి వచ్చెను. అదియొక అర్జీ. ఆ అర్జీని గాంధిజీ వ్రాసి తనమిత్రులకు చూపెను. వారు ఏకగ్రీవముగా బాగుగా ఉన్నదని అంగీకరించిరి. దీనితో వ్రాతలో తనకుగలశక్తిని గాంధిజీ బాగుగా గుఱితించెను.

అందుచే "రాజకోటకు వెళ్ళి అక్కడ ప్రాక్టీసు పెట్టుకొన్నచో బొంబాయిలోవలె విశేష వ్యయముకాదు. అక్కడ కుటుంబము ఉండనే ఉన్నది. అదిగాక ఆదాయము వచ్చుమార్గములుకూడ కలవు. అన్నగారిపలుకుబడిచే కేసులు వచ్చును. మఱియు నాకు అర్జీలలో మంచిఅనుభవము కలదు. అర్జీలను వ్రాసికూడ బాగుగా సంపాదించుకొనవచ్చును." అని ఇట్లు గాంధిజీ ఆలోచించి ప్రాక్టీసును బొంబాయినుండి రాజకోటకు మార్చెను.

## (2) గాంధజీ దక్షిణాఫ్రికాకు వెళ్లుట



గాంధిజీ రాజకోటకు వెళ్ళిన తరువాత దక్షిణాఫ్రికాలో పోరుబందరు అను పేరుగల ఒకపట్టణమునుండి ఆయనకు

ఒక పిలుపు వచ్చెను. ఆపట్టణములో "మేమన్ దుకాణము" అను ఒకవర్తకశాలఉండెను. వారికి, గాంధిగారి అన్నగారికి చాల స్నేహము. తమ "ఆఱు లక్షల రూపాయల కేసు" లో పని చేయుటకు తమ్ముని దక్షిణాఫ్రికాకు పంపవలసినదని వారు ఆయనను కోరిరి.

గాంధీగారు దక్షిణాఫ్రికాకు వెళ్ళుటకు సమ్మతించెను కానిఫీజు చాల కొలఁది. ఆ కేసులో మొదటినుండి తుదివరకు పని చేయుటకు ఇచ్చుటకు ఒప్పుకొనిన ప్రతిఫలము నూటఅయిదు పౌనులులేక 1575 రూపాయలు మాత్రము. రాక పోకల ఖర్చు, భోజనపు ఖర్చులు వారే భరింతురు. అదినిజముగా చాలస్వల్పము. అయినను గాంధిజీ విదేశసంచారము చేయుకోరికయు నూతనము లగు అనుభవములు కలుగునను ఆశయు కలిగి అంగీకరించెను.

స్టీమరు దక్షిణాఫ్రికాలోని నెటాలు దేశమునకు రేవు పట్టణము అగు దర్బానునకు వెళ్లెను. ఆ కేసు యజమాను డగు అబ్దుల్లాసేటుగారు వచ్చి గాంధిజీని తీసికొని వెళ్లిరి.

అబ్దుల్లాసేటుగారు చాల నేర్పరి. వ్యవహారములకు కావలసినంత ఇంగ్లీషు మాత్రము కలదు. దక్షిణాఫ్రికాలోని భారతీయులకు ఆసేటుగారియెడల చాల గౌరవము కలదు.

ఆసేటుజీ గాంధిజీని "దర్బాను" లోని కోర్టునకు తీసి కొనివెళ్ళి తమ మిత్రులతో పరిచయముచేసి ఆయనను తమ

వకీలు ప్రక్కగా కూర్చుండునట్లు చేసిరి. ఆకోర్టు అధికారి మిట్టిమిట్టిచూచి తలపాగను తీసివేయుము "అని ఆజ్ఞాపించెను. ఏలఅనగా ఆదేశములో కూలిపనిలో ఉండు భారతీయులు చాలమందికలరు. అందుచే భారతీయులను అందఱిని కూలీలనుగా చూచుట అలవాటు అయిపోయినది.

కావున ఆ మేజిస్ట్రేటు గాంధిజీని కూలి బారిష్టరునుగా తలంచెను. బారిష్టరుఅయినను కూలిజాతికి చెందినవాఁడు కనుక తలపాగను ధరింప వీలులేదని ఎంచి అట్లు ఆజ్ఞాపించెను.

గాంధిజీ తలపాగను తీసివేయక భారతీయులు తలగుడ్డను ధరించుటలో తప్పులేదుఅని సమర్థించుచు ఆఫ్రికాదేశపు పత్రికలకు వ్యాసములు వ్రాసెను. ఆ వ్యాసమును చూచి పాశ్చాత్త్యులు కొందఱు కూలిబారిష్టరున కింత పొగరా? అని తిట్టిరి. కాని గాంధిజీ లెక్కచేయలేదు. కాని భారతీయులెల్లరు గాంధిజీగారి పట్టుదలకు ధైర్యమునకు మెచ్చుకొనిరి.

మూడు నాలుగు రోజులలో గాంధిగారిపేరు దక్షిణాఫ్రికాలో భారతీయులలోను పాశ్చాత్త్యులలోను చాల విరివిగా వ్యాపించెను.

## 3. గాంధిజీని రైలునుండి దింపివేయుట.



కేసుజరుగుస్థలము ప్రిటోరియా. గాంధిజీ అక్కడకు రైలులో మొదటి తరగతి టిక్కెట్టును కొని బయలు

చేసెను. కాని ఆదేశములో నలుపు తెలుపురంగు భేదము హెచ్చు.

రైలు నెటాలు దేశపు ముఖ్యపట్టణమునకు వచ్చి ఆగెను. మొదటి తరగతిబండిలో ఎక్కుటకు వేఱొక తెల్లవాడువచ్చెను. నల్లవాడగు గాంధిజీ మొదటితరగతిలో కూరుచుండుట అతనికి అవమానముగాతోచెను. అందుచే అతడు గాంధిజీని బండిదిగి వేఱొకతరగతి పెట్టెలోనికి పొమ్మనిగద్దించెను. "నాకు ఫస్టుక్లాసు టిక్కెట్టుకలదు. నేను ఇందు వుండవలయును. మీరుకూడ వుండవచ్చును. అభ్యంతరము లేదు" అని గాంధిజీ జవాబుచెప్పెను.

ఆ తెల్లవాడు ఒకపోలీసువానిని తీసికొనివచ్చి అతనిచే గాంధిజీనిబలాత్కారముగాలాగించి క్రిందికిదింపించెను. ఆయన సామానునుకూడ బండిలోనుండి క్రిందికి దింపిరి. అందుచే నాడు ఆ బండిలో ప్రయాణముచేయుట తప్పిపోయెను.

ఈవిషయమును గాంధిజీ రైల్వేజనరల్ మానేజరునకు, సేటుగారికి తంతిద్వారా తెలిపెను. అబ్దుల్లాగారు ఈ యవమానమును తెలిసికొని మారిట్జుబర్గులోని భారతీయవర్తకులకు తంతివార్తను ఈయగా వారువచ్చి గాంధిజీని కలిసికొని వారి వారికిజరిగిన అవమానములను గుఱించి పగలెల్ల మాట్లాడుకొనిరి. మఱునాటిరాత్రి నిన్నటి వేళకే ప్రిటోరియాకుపోవుబండి వచ్చెను. అందు మొదటితరగతిలో ఒకస్థానమును గాంధిగారికి రైల్వేజనరల్ మానేజరుగారు ప్రత్యేకముగా ఏర్పాటుచేసిరి.

దానిలో అతఁడు ప్రయాణమై ఛార్లెసు అనుపట్టణమునకు వెళ్ళెను.

ఛార్లెసు అనుపట్టణమునుండి జోహాన్సుబర్గు పట్టణము వఱకు ఆరోజులలో రైలు లేదు. అందుచే బాటసారులు గుఱ్ఱపుబండ్లలో ప్రయాణమై పోవుచుందురు.

4 గాంధిజీని గుఱ్ఱపుబండిలో దెబ్బలుకొట్టుట.



గాంధిజీకి గుఱ్ఱపుబండిలో ఎక్కుటకు టిక్కెటుకలదు. కాని అతఁడునల్లవాడు. తమతో సమానమగు స్థానములో నల్లవారు కూరుచుండుటను ఆదేశములో చాలమంది తెల్లవారు సహింపఁజాలరు.

గుఱ్ఱపుబండ్ల అధికారిపేరు "లీడరు". అతఁడు గాంధిజీని తెల్లవారు కూర్చుండుస్థలములో కూర్చుండబెట్టరాదని తలంచెను.

అందుచే అతఁడు లోనికివెళ్ళి బాటసారులుకూర్చుండు స్థలములో తాను కూరుచుండి బండికి ముందుభాగములో రెండుప్రక్కలందును ఉన్న రెండు ఆసనములలో ఒకదాని యందు గాంధిజీనికూరుచుండబెట్టెను. నిజమునకు ఆస్థానములో కూరుచుండ వలసినవాఁడుతాను. గాంధిజీ అదిఅంతయు ఎఱుఁగును. కాని విధిలేక లీడరు చెప్పిన స్థలమునందే కూరుచుండెను.

రెండు మూడు గంటలు నడిచి ఆ బండి దారిలో ఉన్న ఒక యూరును చేరుకొనెను.

అచ్చట ఆ తెల్లవాడు గాంధిజీని కూర్చున్న స్థలమునుండి తొలగించి బండితోలువాని కాళ్లుఉంచు చెక్కమీద కూరుచుండబెట్టవలయునని తలంచి అక్కడ కూరుచుండుమని ఆ-సోటును చూపెను.

గాంధిజీ ఇట్లు చెప్పెను. "నన్ను బండిలో కూరుచుండబెట్టియుండవలసినది. కాని, ముందు కూర్చుండబెట్టితిరి. అంగీకరించితిని. ఇప్పుడు మీరు కాళ్లు ఉంచుస్థలములో కూర్చుండుమనుచున్నారు. ఇదిన్యాయముకాదు. నేను వెళ్లను."

ఆమాట నోటినుండి వచ్చెనో రాలేదో ఆ తెల్లవాడు గాంధిజీనిపట్టుకొని గూబలు పగులగొట్టెను. మఱియు ఆస్థానమునుండి క్రిందికి పడగొట్టబోయెను. కాని గాంధి బండియొక్క చువ్వలను గట్టిగాపట్టుకొనెను. ఆ తెల్లవాడు ఆయనను తిట్టుచు కొట్టుచు క్రిందికి పడద్రోయుటకు యత్నము చేయుచుండెను

ఇంతలో బండిలోనివారు "ఆయన తప్పు లేదు. మీరేల అట్లు కొట్టెదరు? అతనిదే న్యాయము. అతనిని అక్కడ కూరుచుండ నిచ్చుటకు మీకు సమ్మతి లేనిచో మాకడకు పంపుడు ఇక్కడ కూరుచుండబెట్టుకొందుము" అనిరి.

అది ఆతెల్లవానికి సిగ్గుగా ఉండెను. అందుచే గాంధిజీని కొట్టుటమాని బండివానిప్రక్క కూరుచున్న వేఱొక హాటెంటాటు సేవకుని ఆ కాళ్ళుపెట్టుకొను స్థలములో కూరుచుండబెట్టి తాను బండి తోలువానిప్రక్క కూరుచుండెను. కాని ఆతెల్లవాడు "స్టాండర్టనులో కూందు నిన్ను ఏమిచేసెదనో చూడు" అని గద్దించుచు బండిని తోలించెను.

ప్రాణములతో ప్రిటోరియా చేరగలనా అను భయముచే గుండెలుకొట్టుకొనుచుండగా గాంధిజీ ఎట్లెట్లో స్టాండర్టనునకు చేరుకొనెను.

5 మొదటితరగతి రైలుబండిలో పరాభవము!



స్టాండర్టనులో బండిఆగునప్పటికె తనకొఱకు అబ్దుల్లా సేటుగారి మనుష్యులువచ్చి సిద్ధముగా ఉండిరి.

జరిగినవిషయమునంతయు తన పైఅధికారులకు తెలిపెను. మఱునాడు ప్రిటోరియాకు వెళ్ళుగుఱ్ఱపుబండిలో ఈబాధలు లేవు. గౌరవముతో లోపలనే కూర్చుండబెట్టుకొనిరి. అబండి "జోహాన్సుబర్గు" అను మఱియొక ఊరునకు తీసికొనివెళ్ళెను. అక్కడ బసచేయనెంచెను. కాని నల్లవాడగు గాంధికి వారు బస ఈయలేదు.

అక్కడనుండి ప్రిటోరియాకు రైలుమార్గముకలదు. గాంధి స్టేషనునకువెళ్ళి వెలఇచ్చి "మొదటితరగతి టికెట్టును ఇందు" అని కోరెను.

భారతీయులకు సాధారణముగా మొదటి తరగతి టిక్కెట్టును అమ్మరు. ఆస్టేషను మాష్టరు దయతలచి "గార్డు వచ్చి మూడవ తరగతిలోనికి వెళ్లుమనినప్పుడు వెళ్ళుటకు అంగీకరించుదురేని మొదటితరగతి టిక్కెట్టును ఇత్తును" అనెను.

గాంధిజీ "సరే" అట్లే మూడవ తరగతి లోనికి వెళ్లెదను అనెను.

త్వరలోనే గార్డువచ్చి మూడవ తరగతిలోనికి పొమ్మనెను. నాకు మొదటితరగతి టిక్కెట్టుకలదు. నేనేల పోవలయును? అనిగాంధిజీ జవాబుచెప్పెను.

"టిక్కెట్టు ఉన్నను నీవు మూడవతరగతిలోనే ప్రయాణము చేయవలయును" అని గార్డు మరల జవాబు చెప్పెను.

ఇట్లు వాదము జరుగుచుండగా ప్రక్కనున్న తెల్లవాడు అతనికి మొదటితరగతి టిక్కెట్టు ఉండగా మూడవ తరగతిలోనికి పొమ్మని ఏల బాధించుచుంటివి? అని గార్డును ప్రశ్నించెను.

"కూలీ"తో కూరుచుండుటకు నీకేఅభ్యంతరము లేనిచో నాకేమి అడ్డు?" అని ఆ గార్డు వెళ్ళిపోయెను.

రాత్రి తొమ్మిదిగంటలకు గాంధిజీ ఇన్ని కష్టములతో తుదకు గమ్యస్థానమునకు చేరుకొనెను. ఆ యూరిలోగల

"జాన్స్టను" అను తెల్లవాని హోటలునకు బసచేయుటకు భోజనమునకు వెళ్లెను. అతఁడు మంచివాఁడు. తన హోటలులో ఉన్న తెల్లవారితో చెప్పి వారితో కూడ గాంధిజీకి సమీపంకి భోజనము పెట్టుటకు ఒప్పింపగలిగెను. ఆ దేశములోని రంగుభేదమును తలంచినచో అంతసంస్కారము జరుగుట ఆశ్చర్యమే!.

## (6) గాంధిజీ పోలీసువానిచే తన్నులు తినుట.



దక్షిణాఫ్రికాలో భారతీయులకు నిషేధములు చాల హెచ్చు. వారు తెల్లవారు కాపురముఉండు వీధులలో నడువరాదు. రాత్రి తొమ్మిదిగంటలు దాటినతరువాత భారతీయులు ఇల్లుదాటిగ్రామములో సంచారము చేయరాదు.

"కోట్సు" అను తెల్లక్రైస్తవునితో గాంధికి మైత్రికలిగెను. అందుచే సాయంకాలపు వేళలందు గాంధిగారును కోట్సుగారును షికారులకు వెళ్లుచుండిరి. తిరిగి యింటికి వచ్చుటకు ఒక్కొక్కప్పుడు రాత్రి పదిగంటలుఅగు చుండెడిది. భారతీయులు ఎవరును 9 గంటలకు పిమ్మట ఇండ్ల వెలుపల రాదారి చీటీలేక తిరుగరాదు.

కోట్సుగారు తనక్రింది నవుకరునకు తొమ్మిదిగంటలు దాటిన తరువాత గ్రామములో నడచుటకు రాదారిచీటీని ఈయగలఁడు కాని గాంధిగారు నవుకరుకాడుకదా?

అందుచే సర్కారుగారి వకీలుగారగు కౌన్సిజుగారికడకు వారిరువురును వెళ్ళిరి. ఒకరి ముఖమును ఒకరు చూచుకొనగా వారిద్దరు ఒక కళాశాలలో బారిష్టరు పరీక్షకు చదివిన తోడి విద్యార్థులు అని తేలినది.

రాదారిచీటీలేనిదే రాత్రిలు గాంధిగారు నడుచుటకు వీలులేదని తెలిసికొనుటకు ఆయనకు విచారము కలిగెను. కాని చేయునదిఏమి? గాంధిజీకి రాదారిచీటీని ఇచ్చుట అవమానమని కౌన్సిజుగారు ఒకఉత్తరమును ఇచ్చిరి. దానిని గాంధిజీ ఎల్లపుడు జేబులోనే ఉంచుకొనుచుండెను.

గాంధిగారు ప్రెసిడెంటు క్రూగరుగారి యింటిముందుగా మైదానమునకు షికారు వెళ్లుచుండెడివారు. ఆ ఇంటిముందు పోలీసువారు ఎల్లప్పుడు కావలాఉందురు.

ఆ పోలీసులు వంతుల ప్రకారము మారుచుందురు. ఒకనాడు క్రొత్తపోలీసువాడు కావలా ఉండగా గాంధిగారు షికారు వెళ్లుచుండెను. ఆ పోలీసువాడు వచ్చి ఏమియు అడుగకయే; ఈ కాలి బాటను మీరునడువరాదు"అని అయినను చెప్పకయే గాంధిని పట్టుకొని తన్ని తరుముచుండెను.

అదృష్టవశమున అప్పుడే మిత్రుడగు కోట్సుగారు గుర్రముపైని ఆదారిని వచ్చుచు చూచి "గాంధిజీ! నీవు కేసు పెట్టుము. నేను సాక్ష్యము ఇచ్చెదను" అని చెప్పెను.

ఆ పోలీసువాడు అనివిని గాభరాపడుచుండెను. కాని, గాంధిజీ "అయ్యా! పాపము ఇతడు నన్ను ఎఱుగడు. అందుచే ఈ దౌర్జన్యమును చేసెను. నాకు ఎట్టి ఆపద వచ్చినను కోర్టునకు పోవలదని నియమము" అనెను.

కోట్సుగారు "మీరు ఎప్పుడును మీ ధర్మపద్ధతులే అనుష్ఠించుచుందురు. ఇట్టి దౌర్జన్యపరులకు ఒకసారి శిక్షించినగాని బుద్ధి కలుగదు." అని పలుకుచు ఆ పోలిసువానిని డచ్చిభాషలో గట్టిగా మందలించెను.

అతఁడు తన తప్పును ఎఱిఁగెను. మఱియు అట్టి ప్రబలమగు సాక్ష్యము ఉన్నను తీవ్రముగా కొట్టినతనమీద కేసు పెట్టుటకు అంగీకరింపని గాంధిజీ గొప్పతనము ఆ పోలీసువానికి అర్థము ఆయెను.

అతడు వెంటనే గాంధిజీని "క్షమింఁపుడు" అని బతిమాలెను.

## 7 గాంధిజీ సేటుగారి వ్యాజ్యమును రాజీచేయుట.



అబ్దుల్లా సేటుగారి వ్యాజ్యము చాల పెద్దది. వ్యాపారముతో సంబంధించినది అగుటచే చాల చిక్కులు కలవు. కొన్నిపద్దులు నోటిమాటలతో ఒప్పుకొన్నవి. మఱి కొన్ని పద్దులకు ప్రామిసరీ నోటులు కలవు. కానినోటులను మోసము

చేసి వ్రాయించుకొనిరని ప్రతివాదులు కోర్టులో వాదింప మొదలిడిరి. వ్రాసిన లెక్కల పుస్తకములలో గల చిక్కులు అనేకములు.

దావాకు అనుకూలములగు సత్యవిషయములను వెదకి అబ్దుల్లాసేటుగారి పెద్దలాయరుల ఎదుట బెట్టుట గాంధిగారి పని. ఆయనకు ఈ కేసులో పనిచేయుటకు చాల అభిరుచి కలిగెను.

గాంధిజీ కేసులో ఉన్న సత్య విషయములను అన్ని టిని పైకిలాగి గొప్ప లాయరు అగు లియొనార్డుగారికి తెలి పెను. ఆయన యథార్థము మన పక్షమునవే ఉండుటచే ఈ కేసులో మనము తప్పక గెల్చెదము" అని గాంధిజీతో చెప్పెను.

సత్యమును ఎప్పుడు స్వీకరించుదుమో అప్పుడు ధర్మ శాస్త్రముకూడ తోడ్పడును అను విశ్వాసము గాంధిజీకి కలిగెను.

కాని, గాంధిజీ అబ్దుల్లా సేటుగారిని ప్రతివాదు లగు తైయబ్ సేటుగారిని రాజీపఱచుట మంచిది అని తలం చెను. వారిరువురు బంధువులు. ఒకే గ్రామమునందు నివ సించువారు. మఱియు వకీళ్లకు అగు వ్యయము నానాటికి చాల హెచ్చుగా పెరిగిపోవుచుండెను. అందుచే ఆయన తైయబ్ సేట్జీగారిని కలిసికొని రాజీపడుడు అని చెప్పెను.

కాని సులభుగా అంగీకరింతురా? ఎన్నియోసారులు తిరుగగా తిరుగగా తుటతుదకు అంగీకరించెను.

మధ్యవర్తిని ఎన్నుకొనిరి. గాంధిగారి ఖాతాదారు అగు అబులా సేటుగారే గెలిచిరి.

కాని అయిలక్షల రూపాయల మొత్తమును ఒక్కసారి తెచ్చి తైయబ్ సేటుగారు కుప్పమ్మరింపలేరు. అట్లు ఇమ్ము అన్నచో దివాళా తీయవలసినదే. కాని అచ్చటి వర్తకులలో నీతి కలదు. చనిపోవుటకు అయినను అంగీకరింతురు కాని దివాళా తీయుటకు మాత్రము ఒప్పుకొనరు.

దీర్ఘకాలపు వాయిదాలతో పుచ్చుకొనుటకు ఒప్పుకొనిన తైయబ్ సేటుగారు దమ్మిడీలతో కూడ ఆ పెద్ద మొత్తమును ఇచ్చుటకు సిద్ధమే. అబులాసేటుగారు పాపము ఔదార్యముతో గాంధిగారు ఏర్పాటుచేసిన చాల వ్యవధి కల వాయిదాలను ఎంతయో కష్టముమీద అంగీకరించిరి.

ఈ కేసులో పనిచేయుటచే గాంధిజీకి ఎంతయో అనుభవము కలిగెను. మనుజులలో గల మంచి, చెడులు చక్కగా ఆయనకు తెలిసెను. వకీళ్లు వాది ప్రతివాదులకు రాజీచేయుట ఎంత అవసరమో గ్రహించెను. అందుచేతనే ప్రాక్టీసు చేసిన 20 ఏండ్లలో వందలకొలంది కేసులను ఆయన రాజీ చేసెను.

తక్కిన లాయరులు తమ ఆర్జనమునే ప్రధాన విషయమునుగా ఎంచుచుండ గాంధిజీ ఎల్లప్పుడు తన ఖాతాదారుల క్షేమమునే మొదటి విషయమునుగా తలంచుచుండెడివాఁడు. మఱియు తాను వారికి సేవకుడనను భావముకూడ గాంధిజీలో ఎప్పుడును ఉండుచు వచ్చెను. అందుచే ఖాతాదారులకు మొదటినుండియు చాల మేలును చేయగలుగుచుండెను.

ఇట్లు అనేక వ్యర్థవ్యయములను తగ్గించుటచేతను బలవద్విరోధము కల ఇద్దఱిని మిత్రులనుగా చేయుటచేతను ఆ ఇరువురికి గాంధిజీయందు ప్రేమకలిగెను.

కేసు గెలిచెను. సంతోషముతో ఇంటికి రావలయునని ప్రయత్నము చేయుచుండెను.

8 వీడుకోలువిందు : ఎన్నికహక్కుల పోరాటము.

అబ్దుల్లాసేటుగారు గాంధిగారి గౌరవార్థము ఒక విందు చేసిరి. విందునకు వచ్చినవారెల్లరు చాల ఆనందముతో ఆ రోజును గడపుచుండిరి.

ఆ సందర్భములో గాంధిజీపత్రికలను చదువుచుండగా "ఆఫ్రికాదేశపు భారతీయుల ఎన్నికహక్కు" అనుచిన్నవార్త ఒక పత్రికలో కన్పడెను. ఆదేశపు శాసన సభలకు సభ్యులను ఎన్నుకొను హక్కు భారతీయులకు లేకుండచేయు శాసనము ఒకటి ఆదేశపు శాసనసభలో చర్చింపబడుచుండెను.

దానిని గురించి అతఁడు అబ్దుల్లాసేటుగారితో మాట్లాడెను. ఆయన దానిని గురించి ఇట్లు చెప్పెను. "గడిచిన ఎన్నికలలో మాకు ఓటుహక్కు కలదు. మాఓట్లను గొప్పలాయరు అగు ఎస్కాంబిగారి కిచ్చితిమి. వారిని మీరు ఎఱుగుదురు." అనెను.

ఆవిందునకు వచ్చినవారికి అందరికి ఓటుహక్కులను నిలుపుకొనుట అవసరము అని తోచెను. కాని అందులకు పనిచేయువారు ఉండవలయును. గాంధిజీసమర్థుఁడు. పనిచేయ గలఁడు. కాని ఆయన భుక్తికి తగినంత ధనమును వారు సాయము చేయవలయునుగదా?

ప్రజల రాజకీయములగు హక్కులను సంపాదించుటకు తోడ్పడుటలో తనకు ఫీజు అక్కర లేదని గాంధిజీ స్పష్టముగా చెప్పెను.

తరువాత గాంధిజీ కొంతకాలము అక్కడనేఉండి ఆఫ్రికా దేశపు శాసన సభలకు ప్రతినిధులను ఎన్నుకొను హక్కులను ఇండియనులకు సంపాదించుటకు గట్టిప్రయత్నము చేసెను. ఇంగ్లండులో కాలనీల సెక్రిటరీగా ఉన్న రిపన్‌గారికి గొప్ప మహజరునుతయారుచేసి పదివేలమందిచే సంతకములు చేయించిపంపిరి. ఆ మహజరునకు వేయిప్రతులు అచ్చొత్తించి పంచిపెట్టిరి. భారతీయుల హక్కులను గురించి సమర్థించుచు వ్రాసిన వ్యాసములను గాంధిజీ ఆ దేశములోఉన్న అన్ని పత్రికలలోను ప్రకటించెను.

ఎంత ప్రయత్నముచేసినను భారతీయులకు ఎన్నిక హక్కులను ఈయలేదు. కాని గాంధిగారిసేవ అచ్చటి భారతీయులకు మహదానందమును కలిగించెను. అందుచే వారు అందఱు గాంధిజీకి ఒకసంవత్సరమునకు మున్నూరుపౌనులు అనగా రమారమి నాలుగువేల అయిదువందల రూపాయలఆదాయము వచ్చు కేసులను ఇచ్చి సాయముచేయుటకు నిశ్చయించిరి. అందుచే గాంధిజీ దక్షిణాఫ్రికాలో ప్రాక్టీసుచేయుటకు నిశ్చయించెను.

## 9. గాంధిగారిని అడ్వకేటుగా చేర్చుకొనరాదను పోరాటము.

నెటాలులోని సుప్రీముకోర్టులో తనను బారిష్టరుగా చేర్చుకొనుమని గాంధిజీ దరఖాస్తుచేసికొనెను.

ఆ అర్జీని దాఖలుచేసికొనువారు అటర్నీజనరలుపదవిలో ఉండువారు. ఆ పదవిలో ఉన్న "ఎస్కాంబిగారు గాంధిగారికి మిత్రులు. వారు సంతోషముతో ఆ దరఖాస్తును దాఖలుచేసికొనిరి. కాని ఆ దరఖాస్తుతో "తెల్లవాని" సర్టిఫికెట్టును చేర్పలేదు.

ఆదేశపు తెల్ల న్యాయవాదులు నల్లవానిని అడ్వొకేటుగా సుప్రీముకోర్టులో చేర్చుకొనుటా? అని మండిపడి తెల్లవారి

సిఫారసును జతపఱుపలేము కనుక ఆయనను చేర్చుకొనరాదని తెల్లవకీళ్ల సభవారు అభ్యంతరము చెప్పిరి.

కాని జడ్జీగారు "తెల్లవారి సర్టిఫికెట్టు లేకున్నను పరవాలేదు. జతపరచిన సర్టిఫికెట్టు దొంగసర్టిఫికెట్టు కాదు కావున ఆయన ఇచ్చిన దానిని అంగీకరించితిని. ఆ సర్టిఫికెట్టు దొంగది అని ఋజువుచేసినచో గాంధిగారి పేరును వకీళ్లపట్టీనుండి తొలగింతును. ఇంక నల్లఅడ్వకేటును సుప్రీము కోర్టులో చేర్చుకొనవచ్చునా? అనుప్రశ్న కలదు. ధర్మశాస్త్ర దృష్టిలో తెలుపు నలుపుఅను భేదములేదు. అందుచే గాంధిగారిని ఈకోర్టు అడ్వకేటులలో చేర్చుకొనుచున్నాను" అనిరి.

అంత గాంధిగారు లేచి ప్రమాణముచేసి నెటాలు సుప్రీముకోర్టులో అడ్వకేటు ఆయెను.

పిమ్మట ప్రధాన న్యాయాధిపతి గాంధిజీని తలపాగను తీసివేయఁగోరెను. వెంటనే గాంధిజీ "అట్లే" అని ఆయన ఆజ్ఞను శిరసావహించి తలగుడ్డను తీసివేయుటకు అంగీకరించెను.

కాని, గాంధిగారు చేసిన ఈకార్యమునకు అచ్చటి భారతీయులకు చాలకష్టము కలిగెను. ఏలఅనగా ఆయన తలపాగను వదలుటకు అంగీకరింపక ఉండవలసినది అని వారి భావము. దానిని తీసివేయుటకు అంగీకరించుటచే అచ్చట

తలపాగను ధరించు భారతీయులను గాంధిజీ అవమానించె
నని వారు భావించిరి.

గాంధిగారు "ఏదేశములో ఏదిఆచారమో దానిని
అనుష్ఠించుటలో తప్పులేదు అదియుక్తమే" అనిసమర్థింప
జూచెను. కాని అచ్చటిభారతీయులకు వారిజవాబు రుచింప
లేదు.

హిందూ దేశములోని తెల్లఉద్యోగి తలపాగను
తీసివేయుమని చెప్పినచో దానిని అంగీకరింపరాదు. కాని
ఆఫ్రికాలో తలగుడ్డను ధరించు ఆచారములేదు కనుకఇక్కడి
తెల్లఉద్యోగి తలగుడ్డను ధరింపరాదని కోరుట న్యాయమే;
దానిని నేను అంగీకరించుటయు న్యాయమే అని గాంధిజీ
చెప్పెను. కాని ఎన్ని చెప్పినను ఆయనచేసిన పనినివారు సరియని
ఒప్పుకొనజాలరైరి.

## 10 నెటాలుకాంగ్రెసు స్థాపనము.



ఒక్కసారి చిన్న ఆందోళనమును చేసినంతమాత్రము
ననే కోరిన కోరిక సిద్ధించునా? కావున ప్రజల హక్కుల
కొఱకు నిరంతరకృషి సేయు సంస్థ ఒకటి ఉండవలయునను
భావము గాంధిజీకి కలిగెను. సేటు అబ్దుల్లాగారితోను ఇతర
మిత్రులతోను మాట్లాడి అట్టిసంఘమునతఁడు స్థాపించెను.

వచ్చిన ప్రతినిధులందఱు మహోల్లాసములో మునిగి యుండిరి. ఆ సంస్థకు సభ్యులగువారికి చందామాత్రము చాల హెచ్చు. నెలకు అయిదు షిల్లింగులు (అనగా మూడురూపాయల మూడుపావులాలు) చెల్లించినవారు ఆ కాంగ్రెసు సంఘములో సభ్యులు అగుదురు.

నెలకు ఒకపౌనుచొప్పున గాంధిజీ చందా చెల్లించుటకు అంగీకరించి సభ్యుడాయెను. ఇది నిజముగా హెచ్చుమొత్తమే. అబ్దుల్లాసేటుగారు నెలకు 2 పౌనుల చొ॥ చందా వేసిరి. మఱి ఇరువురుమిత్రులుకూడ నెలకు 2 పౌనులు చొ॥ ఇచ్చుటకు సమ్మతించిరి. అట్లు ధనము వేలకొలందిగా వచ్చి బంగారు వర్షము కురిసెను. అనుభవముమీద నెలనెలకు చందాలు వసూలుచేయుట కష్టమని చందాను సంవత్సరమునకు ఒకేసారి వసూలుచేయునట్లు గాంధిజీ నిబంధనలను మార్పించిరి.

డబ్బు వసూలుఅగుట కష్టముగా ఉండెను. ఒక పెద్ద మనుష్యుని నెటాలు ఇండియన్ కాంగ్రెసువారు ఆఱుపౌనులు ఇమ్మని కోరిరి. అతఁడు మూడు పౌనులు ఇచ్చుటకు సమ్మతించెను. కాని, గాంధిజీయు అతని మిత్రులును రాత్రి తెల్లవారువఱకు నిద్దురలేక ఆఱు పౌనులకొఱకు పట్టుపట్టి కూర్చుండిరి. తెల్లవారువేళ ఆఱుపౌనులు ఇచ్చిన తరువాతనే గాంధిజీయు అతని మిత్రులును ఆ పెద్దమనుష్యుని వదలివెళ్ళిరి.

గాంధిజీ ఆ సంఘకార్యములను నిర్వహించినందులకు ప్రతిఫలమును దమ్మిడీయేనియు పుచ్చుకొనలేదు. కాని దానిని చాల సౌష్ఠవముగా నడపెను. ఖర్చుచేసిన ప్రతిదమ్మిడీకి లెక్కలు చక్కగా వ్రాయబడెను.

ధర్మసంస్థాపనలకు అప్పు ఉండుట తగదని గాంధిజీ తలంపు అందుచే అప్పుచేయలేదు. మఱియు అవసరముకంటె హెచ్చుమొత్తమును శాశ్వతనిధిగా ఉంచి దానివడ్డీతో ఆ సంఘమును నడపుటకూడ అంత మంచిపని కాదని ఆయన ఎంచెను. ఏల అనగా అట్టిపని పెక్కుచెడుగులకు హేతువు అగును అని ఆయన తలంచెను.

నేటాలు ఇండియన్ కాంగ్రెసువారు భారతీయులకు ఓటుహక్కు ఉండవలయునని చాల గొప్ప ప్రయత్నము చేసిరి. ఈ విషయమై "భారతీయుల ఓటుహక్కును గుఱించిన ఒక విన్నపము" అను ఒక కరపత్రమును ఆ సంఘమువారు ప్రకటించిరి.

మఱియు "దక్షిణాఫ్రికాలోని ప్రతి బ్రిటిషువానికిని ఒక మనవి" అను మఱియొక చిన్న కరపత్రమును ప్రచురించి అందు ఆ దేశములోని భారతీయుల కష్టములను చక్కగా చర్చించి వానిని తొలగింపగోరిరి. ఈ రెండు కరపత్రములకు గ్రంథకర్త గాంధిజీగారే అని వేఱుగా చెప్పనక్కఱలేదు.

## 11 బాలసుందరము.

దక్షిణాఫ్రికాలో భారతీయులగు కూలీలు చాలమంది కలరు. వారిని "గిరిమిటియా"లు అందురు. ఆ పదమునకు

"అగ్రిమెంటుకూలీ" అనగా కొన్నియేండ్లు కంట్రాక్టు వ్రాసి కొని ఆ ప్రకారము కూలిచేయువాడు అని అర్థము. వారి బాధలకు మితిలేదు.

గాంధిజీ ప్రజాసేవకుడు అనుట లోకప్రసిద్ధము ఆయెను. బీదలలో ముఖ్యముగా ఎవనికి ఏకష్టము వచ్చినను తండ్రి దగ్గఱకు వెళ్ళి చెప్పుకొనునట్లు ఆయనకడకు వెళ్ళి చెప్పుకొను చుండెడివారు.

ఒకరోజు బాల సుందరము అను నతఁడు చేత తల పాగను పట్టుకొని ఏడ్చుచు గాంధిజీ కడకువచ్చెను. అతని నోటిలోని రెండుపండ్లు ఊడెను. యజమాని అతనిని చావఁగొట్టుటచే ఆ పండ్లు ఊడి కుదుళ్లనుండి నెత్తురు కాఱు చుండెను. అది చూచువారలకు చాల జాలికలుగు చుండెను.

బాలసుందరము చేతితో తలపాగ పుచ్చుకొని గాంధిజీ దగ్గఱకు వెళ్ళినమటలో ఒకవిశేషము కలదు. తెల్లవారికడకు నల్లవారు తలపైనిపాగను ఉంచుకొని వెళ్ళరాదు. అది సమాన త్వమును సూచించును. అందుచే తెల్లవారు టోపీతో భార తీయులు తమకడకు వచ్చుటను చూచి సహింపఁజాలరు. బాల సుందరము గాంధిజీకడకు వచ్చునప్పుడుకూడ ఆ పద్ధతినే పూనెను.

గాంధిజీ అతనిని డాక్టరుకడకుపంపి దెబ్బలసర్టిఫికెట్టును ఇప్పించెను. తరువాత మేజిస్ట్రేటు దగ్గఱ చార్జి దాఖలు చేయించెను.

అతనిపైని తెల్లయజమాని చేసిన దౌర్జన్యమును తెలిసి కొని ఆ మేజిస్ట్రేటునకుకూడ చాల కోపము కలిగెను.

బాలసుందరమును కొట్టిన తెల్లవానిని చెఱసాలలో వేయింపవలయుననుట గాంధిజీ ఉద్దేశముకాదు. మఱి అదిఏమి అనగా అతని అధీనములోనుండి ఆ కూలీని తప్పించి వేఱొకని క్రిందికి మార్చుటే.

అందులోను కష్టము కలదు. ఇతనిని గిరిమిటియానుగా తీసికొను వేఱొక తెల్లవాడు కావలయును. ఆరోజులలో గిరిమిటియాలను పనులలో ఉంచుకొనిన భారతీయులు నెటాలులో లేరు. అందుచే గాంధిజీ తెల్లవానిని ఒకనిని వెదకి బాలసుందరమును అతనికి అప్పగించెను.

అట్లు బాలసుందరమును మఱియొకని పేర మార్పనిచో అతనిపైని తెల్లయజమాని క్రిమినలు కేసు తెచ్చి చెఱసాలకు పంపవచ్చును. అందుచేతనే గిరిమిటియాపద్ధతిని బానిసతనము అందురు. ఆ తెల్ల యజమానులు తమక్రింది నల్లగిరిమిటియాలను చాల బాధలు పెట్టుచుండిరి. అది ప్రత్యక్షమగు నరకము.

అట్టి దౌర్జన్యపరుడగు తెల్లయజమానినుండి బాలసుందరమును తప్పించుటచే గాంధిజీకి "గిరిమిటియాబంధువు" అను పేరు కూలీలలో అంతటను వ్యాపించెను. మఱియు ఇండియాకుకూడ పాకెను.

తమ పక్షమున పనిచేసి కష్టములను తొలగింపగల ధర్మమూర్తిని ఒకనిని తమకు భగవంతుడు ఇచ్చెనని దిక్కు లేక క్షోభించుచున్న దక్షిణాఫ్రికా గిరిమిటియాలు పరమేశ్వరు నికి కృతజ్ఞతతో నమస్కృతులు చెల్లించిరి.

## 12 గాంధిజీ గిరిమిటియా పద్ధతితో పోరుట.

గాంధిగారి గిరిమిటియాల పోరాటముకొంచెము ఇంచు మించుగా ఇరువది ఏండ్లవఱకు సంపూర్ణ జయమును గాంచ లేదు.

1894వ సంవత్సరము గిరిమిటియాలపట్ల హక్కులు నిలుపుటకు ప్రయత్నము చేయుటతో ఆరంభము అయిన పోరాటము 1886వ సంవత్సరములో 3 పౌనుల తల పన్నును లేకుండ చేయుటకు చేయు సాత్వికనిరోధముగా పరి ణామించెను.

ఎన్నికహక్కు పోవుటయు, తలపన్ను మీాదపడు టయు మాత్రమేగాక ఆఫ్రికాలోని భారతీయులకు గల బాధలుపెక్కు. డబ్బుఇచ్చి టిక్కెట్టును కొన్నను మొదటి తరగతి రైలుబండిలోను, రెండవతరగతి రైలుబండిలోను వారు ఎక్కరాదు. రాత్రి తొమ్మిదిగంటలకు పిమ్మట వీధులలో నడువరాదు. వీనితోపాటు "వర్తకుల లైసెన్సు ఆక్టు" అను ఒక శాసనము అమలులోనికివచ్చెను. అది భార తీయులను వర్తకము చేసికొనకుండ చేయుటకు ఉద్దేశింప బడెను.

ఇట్లు భారతీయులకు బాధలు పెక్కులు కలుగు చుండెను ఎంత ఆందోళనము చేసినను నెటాలు ప్రభుత్వమువారు గాని, ఇండియా ప్రభుత్వమువారు కాని వానిని తొలగించుటకు పూనరైరి.

అందుచే ఇండియా దేశములోకూడ గొప్ప ఆందోళనము బయలుదేరెను. ఇండియన్ నేషనల్ కాంగ్రెసువారు 1908వ సంవత్సరములో మద్రాసులో సమావేశమైనప్పుడు "దక్షిణాఫ్రికాలోని కాలనీల ప్రభుత్వమువారు చాల గొప్ప మర్యాద కలిగినట్టియు అత్యున్నత దశలో ఉన్నట్టియు భారతీయులనుకూడ పరాభవించుచుండుటను, కఠినముగా చూచుచుండుటను చాల గర్హించుచుంటిమి" అను తీర్మానమును ప్యాసు చేసిరి.

లెక్కలేనన్నిసారులు నెటాలు గవర్నమెంటునకు, ఇండియా గవర్నమెంటునకు, ఇంగ్లండులోని బ్రిటిషుగవర్నమెంటునకు పంపిన మహజరులను బుట్టదాఖలు చేయుటచే గాంధిజీ సాత్విక నిరోధమును ఆరంభింప నెంచుచుండెను. కాని గోకలే గారికి ఇండియా గవర్నమెంటువారు నెటాలులోని భారతీయుల బాధలను తొలగింతుము అని వాగ్దానము చేయుటచే దానిని మొదలుపెట్టియుండలేదు.

"ఇండియా గవర్నమెంటువారు నెటాలు భారతీయుల బాధలను తొలగింతుము" అని చేసిన వాగ్దానమును తప్పిరని బహిరంగముగా 1909 వ సంవత్సరపు ఇండియన్ నేషనలు కాంగ్రెసులో గోపాలకృష్ణ గోఖలేగారు చెప్పుటచే బ్రహ్మాండమగు స్వరూపముతో గాంధిగారు సాత్విక నిరోధమును ప్రారంభించిరి.

ఈ మహా "సాత్విక నిరోధ" శాంత యుద్ధములో ఒక్క నెటాలులోని భారతీయులు మాత్రమేగాక దక్షిణాఫ్రికాలోని భారతీయులు అందఱును ధర్మరక్షణము కొఱకు శాంతపద్ధతులతో గవర్నమెంటువారి దుష్టశాసనములను ఉల్లంఘించి పోరిరి.

ఆసాత్విక నిరోధశాంతయుద్ధమునందు పదివేలమంది కంటె హెచ్చుగా భారతీయులు దక్షిణాఫ్రికాలోని అన్ని ప్రాంతములనుండియు వచ్చి చేరిరి.

ఆసాత్విక నిరోధుల పైని కొన్నిస్థలములలో ఆఫ్రికా దేశములోని తెల్లపరిపాలకులు తుపాకులను కాల్చుటచే కొందరు చచ్చిరి. అనేక బాధలు పొందిరి.

పదివేల మందికంటె హెచ్చుగా చెరసాలలకు వెళ్ళిరి. తుట్టతుదకు ఆఫ్రికాదేశములోని తెల్లపరిపాలకులు గాంధిగారి సాత్విక నిరోధ శాంతయుద్ధమునకు లొంగిపోయిరి.

వారిక్రోధమునకు సాత్విక నిరోధులు ప్రేమను కానుకగా ఇచ్చిరి. పరిపాలకులు కొట్టినను తిట్టినను సంతోషముగా భరించిరి.

## 13 తలపన్ను పోరాటము



భారతీయులకు దక్షిణాఫ్రికాలో జరిగిన అన్యాయములలో తలపన్నును విధించుట చాలఘోరము.

నెటాలులోని తెల్లప్రభుత్వమువారు ఆ దేశములో కాపురము ఉన్న భారతీయులకు సంవత్సరమునకు 375 రూపాయలు చొప్పున తలపన్నును విధించుటకు ఒక బిల్లునువ్రాసిరి. అట్టి ఘోరకార్యము ప్రపంచచరిత్రలో లేదు. ఈబిల్లు వార్తను వినగనే గాంధిజీయు దక్షిణాఫ్రికాలోని భారతీయులును దిగ్భ్రమచెందిరి.

వెంటనే వారు నెటాలు ఇండియన్ కాంగ్రెసు అను పేరుగల తమ సంఘపు మీటింగును జరిపిరి. అందు సత్వరముగా ఈబిల్లును ప్రతిఘటించి తీసివేయవలయునని భారతీయులు నిశ్చయించిరి.

ఆదేశములో ఉన్న భారతీయులలో చాలమంది బీదవారు. అట్టివారిపైని తెల్లవారు ఇంత పగను పూనుటకు కారణము ఏమి అనగా భారతీయులు నెటాలునకు మొదట

గిరిమిటియా కూలీలుగా అయిదేండ్ల కంట్రాక్టుమీద వెళ్ళిరి. తీసికొని వెళ్ళునప్పుడు ఆ కూలీలు పాటుపడి భూములను సంపాదించుకొని పాడిపంటలను పండించుకొనవచ్చునని ఆ తెల్లవారు వాగ్దానము చేసిరి.

కాని భారతీయులు కష్టజీవులు. వారు పెక్కు రకముల కూరగాయలను పండించి ధనమును కూడబెట్టిరి. మామిడి మొదలగు పండ్లతోటలను వేసి చాల ధనమును ఆర్జించి ఇండ్లు కట్టుకొని మంచి ఆదాయముకల రైతులు అయిరి.

అంతటితో ఆగలేదు. ఆ గిరిమిటియాలలో పెక్కురు వర్తకములలో ప్రవేశించిరి. తెలివి తేటలతో బాగుగా డబ్బు సంపాదించుటకు మొదలుపెట్టి ధనవంతులైరి.

తెల్లవారికంటె భారతీయులు మితవ్యయముకలవారు. అందుచే వారు ధనమును హెచ్చుగా కూడబెట్టుకొందురు. అందుచే తెల్లకూలివారు నల్లకూలివారితో పోటీకి ఆగలేక పోయిరి. అట్లే తెల్లవర్తకులకు నల్లవర్తకుల పోటీ చాల నష్టమును కలిగించుచుండెను. అందుచే హెచ్చు సంఖ్యలు కలిగి ఆ దేశమును ఏలుచున్న తెల్లవారికి నల్లవారిమీద కడుపుమంట కలిగి ఆ దేశమునకు వలసపోయినవారిని అయిదు ఏండ్లు అయిన

వెంటనే తిరిగి ఇండియాకు పోవునట్లు చేయవలయునను కోరిక పుట్టెను.

ఆ గిరిమిటియా కూలీలను ఇండియాకు బలాత్కారముగా తీసికొనివచ్చి అయిదేండ్ల కాలము ముగియులోపలనే అప్పజెప్పవలయునను ఒక నిబంధనను చేయనెంచిరి. అది చాల అక్రమము. ఒక దేశములో నివసించి సుఖజీవనము చేయవలయునని తలంచువారిని బలవంతముగా తీసికొనివెళ్ళి వేఱు దేశములో దింపుట చాల ఘోరము అని ఇండియా గవర్నమెంటువారు దానిని ఒప్పుకొనలేదు.

గాంధిజీగారును నెటాలు ఇండియను కాంగ్రెసువారును ఈ తలపన్ను బిల్లునకు వ్యతిరేకముగా బ్రహ్మాండము అగు ఆందోళనము చేసిరి. పత్రికలలో వ్రాసిరి. మహాజరులు పంపిరి. ప్రభుత్వమువారికడకు రాయబారములు పంపిరి.

ఇంగ్లండులోని బ్రిటిషుగవర్నమెంటువారికి ఆ తలపన్ను ఘోరమును గుఱించి బాగుగా తెలియునట్లు చెప్పుకొనిరి. హిందూదేశపు గవర్నమెంటువారికికూడ దానిని అంగీకరింపరాదని చాల గట్టిగా విన్నవించుకొనిరి.

ఇంత ఆందోళనమును చేయగా తుట్టతుదకు ఇండియా గవర్నమెంటువారు ఆ తలపన్నును సంవత్సరమునకు నలుబది అయిదు రూపాయలుగా మార్చిరి.

నెటాలు ఇండియను కాంగ్రెసును గాంధిగారును చేసిన ప్రయత్నము కొంతవఱకు ఫలించెను. కాని సంపూర్ణఫలితము వెంటనే సిద్ధింపలేదు. 375 రూ.లు తప్పినను ఆఫ్రికాలో ని సించు ప్రతిభారతీయునకు సలుబదిన్నైదు రూపాయల తలపన్ను విధించుట చాల ఘోరమే. ఇట్లు పదునాఱేండ్ల కుమారుడును పదుమూడేండ్ల కుమారితెయు కల తలిదండ్రులు ఉవా బిడ్డలతో నలువురకు మొత్తము నూట ఎనుబది రూపాయ లను ఆదేశములో నివసించినందులకు మాత్రము చెల్లింప వలయును.

ఆ నలువురకు సంపాదనము కొంచెము అయినను ఉన్నదా లేదా అను విచారణము చేయనక్కఱలేదు. వారికి ఆస్తికలదా లేదా అను ప్రశ్న అక్కఱలేదు. వారికి కు దొరకుచున్నదా లేదా అని విచారింప నక్కఱలేదు. నెటా లులో నివసించిన చాలును. అంతపన్నును చెల్లించి తీరవల వదే. అట్టి తలపన్నును ఏ దేశములోను ఏనాడును ఏ ప్రభుత్వ మును వేసియుండలేదు.

## 14. పరాభవము.

గాంధిగారు దక్షిణాఫ్రికాకు వెళ్ళినది జీవనోపాధి కొఱకును క్షత్రియవాడులోని విరోధుల కుట్రలనుండి బయట పడుటకొఱకును.

కాని, ఆయన నానాటికి ప్రజాసేవలో మునిగి పోయెను. ఏలఅనఁగా ఆయన హృదయమునందు పరమేశ్వరుని

సందర్శింపవలయునను కోరిక దినదినము హెచ్చిపోవు చుండెను.

అతని ఈశ్వరభక్తిని, సత్యబుద్ధిని ప్రజలు తెలిసికొని చాలమంది క్రైస్తవులుమిత్రులైరి. వారిలో దక్షిణాఫ్రికాలోని క్రైస్తవ మతబోధక సమాజమునకు అధ్యక్షులు స్పెన్సరు వాల్టనుగారొకరు. గాంధిజీయెడల ఆయనకుగల ప్రేమ లపటము, కృత్రిమము లేనిది. అందుచేతనే అతడు గాంధిజీని క్రైస్తవ మతములో చేరుమని ఎప్పుడును చెప్పనేలేదు. గాంధిజీ వారింటిలోనివారిలో ఒక్కడుగా ఆయనతో కలిసి మెలసి ఉండెడివాడు.

వేరొక క్రైస్తవ కుటుంబముతో కూడ గాంధిజీకి మైత్రికలసెను. గాంధిజీ ప్రతి ఆదివారము వారియింటికి వెళ్ళుచుండెడివాడు, ఆరోజులలో గాంధిజీ బుద్ధచరిత్రమును చదువుచుండెను. బుద్ధునియందు గల అపారమగు జీవకారుణ్యము ఆయన మనస్సునకు బాగుగానచ్చెను. మహామ్మదు; ఏసుక్రీస్తు మొదలగు ఇతర ప్రవక్తలు జంతుహింసను సంపూర్ణముగా నిషేధింపలేదు అనియు ఒక్క బుద్ధుడే ఈశ్వర సృష్టిలోని జీవులలో ఏ జీవికి కూడ ఏమాత్రమును హింస చేయరాదని బోధింపగలిగెననియు తలంచి అహింసాతత్వమునకు క్రమ క్రమముగా పట్టుకొమ్మ అగుచున్న గాంధిజీ ఆయనను ప్రేమించుచుండెను.

ఆమిత్రుని భార్యకు క్రైస్తవమతమునందు చాల విశ్వాసము. అప్పుడప్పుడు గాంధి ఆమెతో మతచర్చలు చేయుచుండెడివాడు.

ఒకరోజు క్రీస్తు, బుద్ధదేవుల తారతమ్యమును గురించిన చర్చవచ్చెను.

ఆచర్చలో గాంధిజీ బుద్ధదేవుని జీవకారుణ్యము నోరులేని జంతువులమీద కూడ వ్యాపింపగా ఏసు క్రీస్తు యొక్క భూతదయ ఒక్క మనుష్యులమీదనే వ్యాపించెను అని చెప్పుచు బుజములమీద గొర్రెపిల్లను ఎత్తుకొని దానినిచంపుట పాపకార్యముఅని బోధించు బుద్ధదేవుని భూతప్రేమతో పోల్పదగిన సర్వభూత ప్రేమ ఏసుక్రీస్తునందు లేదని పలికెను.

అది ఆమె మనస్సునకు కష్టమును కలిగించెను. అది తెలిసికొని గాంధిజీ ఆప్రసంగమును విరమించెను.

తరువాత భోజనమునకు లేచిరి. వారింట అయిదేండ్ల బాలుడొకడు కలడు. గాంధిజీకి బాలురతో ఆడుకొనుటయందు పిన్నతనమునుండియు చాల ఆసక్తి. ఎంత క్లిష్టములగు సమస్యలను గురించి ఆలోచించునప్పుడుకూడ ఆయన బాలురతో పరిహాసములాడుచుండును. వారిని బుజ్జగించుచు చమత్కారములగు ప్రసంగములు చేయుచుండును.

అందుచే గాంధిగారు ఆబాలునిపిలిచి చేతితో ఒక రేగుపండును పుచ్చుకొని "అబ్బాయీ! ఇటురమ్ము. ఈపండును తీసికొని భుజింపుము. నీపళ్లెములోగల మాంసపుముక్క మంచివస్తువుకాదు. దానిని తినకుము" అనెను.

ఆబాలుడు రివ్వునవచ్చి "అవును ఈపండు చాల రుచిగాఉండును. ఆమాంసము మంచిదికాదు." అని గాంధిజీ చేతిలోని రేగుపండును తీసికొని సంతసముతో భుజించుచు "మాంసము మంచిది కాదు". అని పలుక దొడగెను.

మాంసభోజనమును సాధారణముగా నిరసించుటయే ఆమెకు రుచింపదు. అందును తన బిడ్డకు మాంసమును భుజింపరాదని నేర్పుట ఆమెకు చాల కోపమును కలిగించెను.

గాంధిజీ ఆమెముఖమునందు కన్పడుచున్న కోపమును కనిపెట్టి మాంసనిషేధమును గురించి బోధించుటనుమాని వేఱొక విషయమును మాట్లాడి ఆమెను శాంతింపఁ జేయనెంచెను. కాని ఆమె శాంతించినట్లు కన్పట్టినను మనసునందలి బాధ తగ్గలేదు.

మఱునటి ఆదివారము చాల జంకుతో గాంధిజీ వారింటికి భోజనమునకు వెళ్లెను. మొదటపోవలదు అనుకొనెను. కాని,

తగిన కారణము లేకయే మైత్రిని విడుచుట మంచిదికాదను కొనుచు వెళ్ళెను.

స్వాగతమిచ్చెను. కాని ఆమె ఇట్లు చెప్పెను. "మీ మైత్రి నా బిడ్డకు హానిచేయుచున్నది. మీరు మాంస భోజనము మంచిదికాదని చెప్పుచుండుటచే నాబిడ్డ మాంసమును విడిచిపెట్టి పండ్లకొఱకు ఏడ్చుచున్నాడు.

మాంసమును విడిచినచో అతఁడు క్రమక్రమముగా చిక్కి తుదకు ఎముకలరాశి అగును. మీ మాంస నిషేధ బోధనమును మాబోటి పెద్దలకు చేయవచ్చును. అంతమాత్రముచే మా మనస్సులు మారవు. కాని, ఆ పసిబిడ్డ మీ మాటలువిన్నచో మాంసభోజనమును మాని ఎండిపోవును" అనెను.

గాంధిజీ "అమ్మా నాకును బిడ్డలుకలరు. మీకు బిడ్డలపైని ఎంత ప్రేమ ఉండునో నేను ఎఱుఁగుదును. మీ బిడ్డకు హానిచేయుట నాకు ఇష్టము కాదు. నేను ఇఁక మీ యింటికి రాను. వచ్చినచో ఆ బిడ్డతో మాంసమును భుజింప రాదని చెప్పకున్నను నేను భుజింపక ఉండుటను చూచి అతఁడు మాంస భోజనము మంచిది కాదని ఊహించు కొనును. అందుచే మాంసమును తినకుండుటే అతనికి ఆదర్శమై మాంస భోజనము వెగటును కలిగించుచుండవచ్చును.

క్షమింపుము” అనెను. ఆమె “మంచిది” అని గాంధిజీ రాకుం డుటకు ఒప్పుకొనెను. గాంధిజీ ఆమె ఇంటికి వెళ్ళుటకు అదియే తుదిసారి.



## 15. గాంధిజీ కుటుంబ నిర్వహణము.

నెటాలులో గాంధిజీ ఇంటిపనిని ఎట్లు నిర్వహించెను? అను విషయమును గురించి కొంచెము చదువుదము. లండనులో కేవలము మితవ్యయమును, శాకాహారదీక్షను, ఆరోగ్యమును మనస్సునందు ఉంచుకొని అంతకుపూర్వము ఎప్పుడును ఎఱుగని స్వహస్తపాకమును అవలంబించెను.

బొంబాయిలో ఆయన కుటుంబ నిర్వాహణము దర్జాకు సంబంధించినది. వంటబ్రాహ్మణుడు ఉండెను. గాంధిజీకి అతని వంటతో విశేషసంబంధము లేదు. గ్రంథములనుపఠించుకొనుచు తనపనిని తాను చేసికొనుచుండెను.

రాజకోటలో కుటుంబ భారము అన్నగారిమీఁదను భార్యమీఁదను ఉండెను. తనకు దానితో అంతగా ప్రసక్తిలేదు. వచ్చుచు పోవుచుండు బంధువులయు మిత్రులయు రాకపోకలతో వ్యయము హెచ్చుగనే అగుచుండెడిది.

దక్షిణాఫ్రికాలో గాంధిజీ ఇంటిపనిని స్వాయముగా నిర్వహించుకొన జొచ్చెను. దానిని అతఁడు తన బారిష్టరు పదవికి తగిన దర్జాతో జరుపుకొననలసివచ్చెను. పట్టణములో మంచి సొగసైన ఇంటిని అద్దెకు తీసికొనెను: సాధారణముగా బారిష్టరుల ఇండ్లలో ఉండు అన్ని ఉపకరణములను అందు చేర్చెను. తఱచుగా అనేకమిత్రులు వచ్చుచు ఆతిథ్యమును గొనుచుండుటచే వ్యయము హెచ్చుగనే అగుచుండెను.

ఇంతవఱకు రాజకోటనుండి తనభార్యను బిడ్డలను తీసికొని రాలేదు. అందుచే వంటవాఁడే అన్నము కూరలు మొదలగు వానిని వండి గాంధిజీకి పెట్టుచుండెను. ఉదయము కొంచెము రొట్టెను కోకోను పుచ్చుకొని ఆఫీసునకు వెళ్లి తన కేసులను చూచుకొని ఒంటిగంటకు ఇంటికివచ్చి భోజనముచేసి కోర్టునకు వెళ్ళుచుండెడివాఁడు.

గుమాస్తాలు, వంటవాండ్రు గాంధిజీని "ఎవరేది చెప్పిన దానిని విశ్వసించు అమాయికుడు" అని చెప్పుకొనుచుండెడివారు. కూరలు కొనితెచ్చుట, కావలసిన భోజనసామగ్రిని తెచ్చుట మొదలగు పనులను వంటవాండ్రే నిర్వహించుచు వచ్చిరి. అందుచే మఱి కొంచెము వ్యయము హెచ్చుఅగుట తటస్థించుచుండెడిది.

ఇట్లు గాంధిజీ తన ఆఫ్రికా జీవితములోని మొదటి మూడుసంవత్సరములను గడపెను. ఇంటి విషయములలో శ్రద్ధవహించుటకు అగ్నిసాక్షిగా వివాహముచేసి కొనిన భార్య లేకపోవుట లోపముగనే ఉండెను.

మఱియు కుటుంబ నిర్వాహణములో పెక్కు కష్టములు కలుగుచుండెను. పసిబిడ్డలు లేకపోవుటచే గృహము అంధకారము వలె కన్పట్టుచుండెను.

అందుచే 1896 వ సంవత్సరములో హిందూ దేశము నకువచ్చి ఆఫ్రికా భారతీయుల కష్టములను గుఱించి ఈ దేశములో ప్రచారము చేయుటకును కుటుంబమును తీసికొని వెళ్లుటకును నెటాలు మిత్రుల దగ్గఱ సెలవు పుచ్చుకొని స్వదేశమునకు స్టీమరులో ప్రయాణమై వచ్చెను.



## 16. స్టీమరు ప్రయాణము : ఇండియాలో దక్షిణాఫ్రికా సమస్యలను గూర్చి ప్రచారము చేయుట

గాంధిజీ స్టీమరులో 24 రోజులు చాల ఆనందముగా గడపెను. ఆ ప్రయాణ కాలములో ఆయన ఒక్క నిమిషమును కూడ వ్యర్థము చేయలేదు.

చాలకాలమునుండియు ఆయన "ఉరుదు"ను నేర్వవలయు నని తలంచుచుండెను. ఆంగ్లేయుడు ఒకడు సహాపాఠి ఆయెను. బోధించుటకు ఒక మున్షీ దొరకెను. గాంధిజీ ధారణకంటె ఆ ఆంగ్లేయుని ధారణ చాలహెచ్చు. అతనికి ఒకసారిచూడగనే అక్షరములు వచ్చుచుండెను. గాంధిజీకి కష్టపడి దిద్దుకొనినగాని జ్ఞాపకము ఉండెడివికావు. ఈ ప్రయాణములో అఱవమును కూడ కొలదిగా ఆయన నేర్చుకొనెను.

ఆ ఆంగ్లేయునితో నీతిని ధర్మమును గుఱించినచర్చలు అప్పుడప్పుడు జరుగుచుండెను. ప్రత్యేకముగా ఈవిషయ మును గుఱించి మాట్లాడుటకు కారణము కలదు. ఆస్టీమ రులో గాంధిజీ మాంసము కలిసిన వంటకములను బహిష్క రించుచుండెను. మాంసమును ఏల నిషేధింపవలయును? గాంధిజీ ఏల మాంసమును తినరాదు? గోమాంసమును తిని నను పాపమేమి? అని ఆ ఆంగ్లేయునివాదము.

"నీతి, ధర్మము" వీనిని అనుసరింప వలయుననుట గాంధిజీ సిద్ధాంతము. ఆరెంటిని అనుసరింపక స్వేచ్ఛగా ఉండుట మంచిది అని ఆ ఆంగ్లేయుని వాదము. కూరగాయ లను తినునట్లు ఇచ్చవచ్చిన జంతువులను చంపి తినినచో పాపము లేదని ఆయన భావము. జీవహింస చేయుట పాపమని గాంధిజీ భావము.

ఈ ప్రసంగము సహజముగా భగవంతుడు కలడా లేడా?ఉన్నచో అతనికి మనతో ఎట్టి సంబంధముకలదు? అను ఇట్టి ప్రశ్నలకు దారి తీయునుకదా?

స్టీమరు కలకత్తాకు చేరెను. వెంటనే బొంబాయికి గాంధిజీ బయలుదేఱెను. దారిలో అలహాబాదులో దిగి పయొనీరుపత్రికాధిపతికి దక్షిణాఫ్రికా సమస్యను అర్థము అగునట్లు చక్కగా విప్పి చెప్పెను. ఆయన దక్షిణాఫ్రికా సమస్యను గుఱించి గాంధిజీవ్రాయు విషయములను చదివిపత్రికలలో న్యాయముగా చర్చింతునని గాంధిజీకి వాగ్దానము చేసెను.

రాజకోటకు వెళ్ళెను. దక్షిణాఫ్రికా భారతీయుల కష్టములను గుఱించి ఒక చిన్న పుస్తకమును వ్రాసి పదివేల ప్రతులు ముద్రించి ప్రకటించెను. హిందూదేశములోని అన్ని ప్రాంతముల పత్రికలకు అన్ని పక్షముల నాయకులకు ఆ చిన్నపుస్తకమును పంపెను.

అందలి భావములను గుఱించి "పయొనీరు" పత్రిక ఒక చిన్న వ్యాసమును ప్రకటించెను. ఆపత్రికలోని వ్యాసమును చదివి ఆసమస్యను గుఱించి అపార్థమునకు హేతువగునట్లు కొలఁది సంగ్రహమును రూటరు ఇంగ్లండునకు పంపెను. ఆవార్త చాలచిన్నదే. కాని అది గాంధిజీకి ప్రాణోపద్రవమును కలిగించెను. దానిని ముందటిభాగములో మనము చదువగలము.

## 17. "ప్లేగు" రోగనిరోధము.

గాంధిజీ ఇట్లు దక్షిణాఫ్రికా సమస్యను గురించి సర్వహిందూదేశమునందును తిరిగి స్వయముగా ఆందోళనము

చేయుచుండు రోజులలో బొంబాయిలో పిల్లలపిడుగువలె ప్లేగు వచ్చిపడెను.

ప్రజలు ఎక్కడివారక్కడ చెల్లాచెదరు అగుచుండిరి. రాజకోటకు కూడ ప్లేగు వచ్చునను భయము ప్రజలలో వ్యాపించెను.

అట్టితఱి ప్రాణరక్షణము కొఱకు విద్యాధికులు పాఱి పోవుచుండిరు. కాని గాంధిజీకి ప్రజాసేవయే జీవనము. ఆయనకు ఆరోగ్యశాఖలో పనిచేయుటలోగల నైపుణ్యము నిస్సమానము. వెంటనే బొంబాయికి వెళ్ళి వ్యాధిపరీక్షకుల సంఘములో చేరెను.

ఆయన ఆ సంఘసభ్యులతో గలిసి పాకీదొడ్లను. పరీక్షించెను. బీదలు వారి పరీక్షకు ఒప్పుకొనిరి. భాగ్యవంతులు ఒప్పుకొనలేదు. భాగ్యవంతుల పాకీదొడ్లు చాలఅసహ్యముగా ఉండెను. కుళ్ళు, చెడు కంపు కలిగి అవి చీకటిగా ఉండెను. మఱియు వానిలో పురుగులు కులకుల లాడుచుండెను.

మనుష్యులు పాకీదొడ్లలో విడుచు మలమూత్రములు భూమిమీద పడకుండ బొక్కెనలలో పడునట్లు చేసి పాకీ వాండ్రచే సకాలములో బాగుచేయించునట్లు ప్రజలకు గాంధిగారు బోధించిరి.

మాలవాండ్ర పేటకు వెళ్ళి చూచుటకు గాంధిగారితో ఆసంఘములో మఱియొక సభ్యుడు మాత్రము బయలుదేరెను. కాని వారికి పాకీదొడ్లు లేవు. వారు సాధారణముగా మలమును విడుచుటకు దూరముగా పోవుచుందురు.

గాంధిజీ వారి యిండ్లను పరీక్షించెను. ఇండ్లను లోపలను వెలుపలను ఆవుపేడతో అలికిరి. వర్ణములవారి యిండ్లకంటె వారి చిన్న గుడిసెలు చాల శుభ్రముగా ఉండెను. అది గాంధిజీకి సంతోషమును కలిగించెను.

గాంధిజీ ఒక ధనవంతుని పాకీదొడ్డిని చూచెను. దగ్గర నిలుచుటకు వీలులేనంత చెడుగాలి పాకీదొడ్డిలోనుండి ఆయన ఇంటికివచ్చుచుండెను. పరీక్షా సంఘసభ్యుల ముక్కులు పగిలిపోయెను. మఱి ఆయింటివారచ్చట ఎట్లు బ్రతుకుచున్నారో!.

ఒక వైష్ణవాలయమును గాంధిజీ చూచెను. ఆ పూజారికి, గాంధి కుటుంబమునకు చాల స్నేహము. దాని ఆవరణలో ఆ పూజారి ఎప్పుడును చూడని ఒకచోటునకు గాంధిజీ వెళ్ళెను. ఊడ్చిన ఎంగిలి విస్తళ్ళు, చెత్త మొదలగు వానితో నిండి అది చెప్పరానంత అసహ్యముగా ఉండెను. ఆ దేవళపు దుస్థితికి గాంధిజీ చాల దుఃఖించెను.

## 18. గాంధిజీ రాజభక్తి

ఆ రోజులలో గాంధిజీకిగల రాజభక్తిని చూచినచో నేటిగాంధిజీ నాటిగాంధిజీయేనా? అని తోచును. నేటాలులో జరుగు సభలన్నిటిలోను ఆయన "గాడ్ సేవ్ దికింగు" (అనగా దేవుడు రాజును రక్షించును గాక) అను పాటను పాడించుచుండెడివాడు. తానుకూడ వారితో గలిసి పాడుచుండెడివాడు. అది నటనకాదు. ఏలఅనఁగా ఆయన గవర్నమెంటు వారవలన ఎట్టి ప్రతిఫలమును ఎప్పుడును కోరియుండలేదు. ఆయనకుగల సత్యనిరతిచేతనే రాజభక్తి అలవడెను గాంధిజీ ఆ రోజులలో బ్రిటిషురాజనీతి లోకమునకు క్షేమకరమనియే తలంచుచుండెను.

దక్షిణాఫ్రికాలో తెల్లవారి వర్ణద్వేషమును గాంధిజీ బాగుగా ఎఱుగును. కాని, అది బ్రిటిషుజాతి సంప్రదాయమని తలంపలేదు. ఆదేశమునకు చెందిన ప్రత్యేక విషయముగా తలంచెను. అందుచే గాంధిజీలో తెల్లవారిలో కంటె హెచ్చుగా రాజభక్తి ఉండెను. అందుచేతనే ప్రతి సభలోను అతఁడు విధిగా ఆపాటను లయతోసహా పాడుచుండెడివాడు.



## 19. బొంబాయి సభ

దక్షిణాఫ్రికా సమస్యలను గుఱించి బొంబాయిలో ఉపన్యసించుటకు గాంధిజీ వెళ్ళెను. ఆరోజులలో సర్ ఫిరో

జివా మెహతాగారు బొంబాయికి కిరీటములేని చక్రవర్తియై యుండెను.

అందుచే ఆయనను సందర్శించుటకు గాంధిజీ వెళ్లెను. ఆయన పేరు చెప్పగనే గాంధిజీకి గుండెలు అదరుచుండెను. కాని ఆయన చాల ప్రేమ కన్నతండ్రివలె గాంధిజీని ఆదరించి దక్షిణాఫ్రికా సమస్యను గురించి సభ చేయుటకు అంగీకరించి ఒకరోజును నిర్ణయించి దానిని గురించి పత్రికలలో ప్రకటించెను.

రేపు సభ జరుగునవగా మెహతాజీని గాంధిగారు వెళ్ళిచూచిరి. ఆయన మీరు ఉపన్యాసమును వ్రాసితిరా? అని ప్రశ్నించెను.

"నేను ముందుగా వ్రాయకయే అప్పటికప్పుడు సభా వేదికపైని మాట్లాడెదను" అని గాంధిజీ బదులుచెప్పెను.

మెహతా అట్లుకాదు ఉపన్యాసమును రాత్రి పదిగంటలలోగా వ్రాసి ముద్రణకు ఇమ్ము అనిరి.

మెహతాగారి "మున్షి" ఆవేళకు గాంధిజీని కలిసికొనెను. వ్రాసిన ఉపన్యాసమును ఆ మున్షీకిచ్చెను. ఆయన దానినిచూచి ముద్రించుటకు ఆజ్ఞను ఇచ్చెను.

గాంధిజీ సభావేదికమీదికెక్కెను. సభాస్థలము క్రిక్కిరిసి యుండెను. గాంధిజీ ఉపన్యాసమును మెల్లగా చదువం దొడగెను.

"బిగ్గఱగా బిగ్గఱగా" అని ప్రజలు అఱచుటకు ప్రారంభించిరి. గాంధిజీ కొంచెము బిగ్గఱగా చదివెను. కాని ప్రజలకు వినపడుటలేదు. "ఇంకను బిగ్గఱగా" అని హెచ్చరించిరి. కాని గాంధిజీకంఠము హెచ్చుటకు మాఱుగా తగ్గిపోవుచుండెను.

కేశవరావు పాండ్యాగారు వచ్చి చదివిరి. కాని ప్రజలకు ఆయనపైని మోజులేదు. అంత వాచాగారు ముందునకు వచ్చిరి. సభ ఎల్ల నిశ్శబ్దము. సభ్యులు మొదటినుండి తుదివఱకు విని దక్షిణాఫ్రికా సమస్యలను చక్కగా తెలిసికొనిరి.



## 20. పునహా సభ.

గాంధిజీ బొంబాయినుండి పునహాకు వెళ్ళెను. అచ్చట గాంధిజీ ఇరువురు మహాపురుషుల దర్శనము కావించెను.

లోకమాన్యతిలకు హిందూదేశ స్వారాజ్యయుద్ధచరిత్రమునందు బంగారు అక్షరములలో వ్రాయదగిన పుణ్యపురుషుడు. జీవితమునంతటిని భారతభూమిని ఉద్ధరించుటకొఱకే వినియోగించెను. పెక్కుకష్టములు పొందెను. అతని

అపారమగు పలుకుబడిని చూచిభయపడి గవర్నమెంటువారు ఆయనకు ఆరేండ్లు ప్రవాసశిక్షను విధించి బర్మాదేశమునకు తీసికొనివెళ్లి మాండలేకోటలో నిర్బంధించిరి. ఆ ప్రవాస శిక్షనుండి మరలి రాగనే భారతదేశ స్వరాజ్యసిద్ధికొఱకు బ్రహ్మాండమగు కృషి చేసెను. సంస్కృతమునందు అపార పాండిత్యమును గడించి వేదములను పరిశోధించి ప్రాచీ నార్యుల జన్మభూమిని నిరూపించెను. భగవద్గీతపైని ఒక వ్యాఖ్యానమును వ్రాసి భారతీయుల మెప్పునకు పాత్రు డాయెను.

గోపాలకృష్ణ గోఖలే గొప్ప రాజకీయవేత్త. తిలకు గారు ప్రభుత్వమున కెంతశత్రువులో గోఖలేగారు వారికంత మిత్రులు. అయినను గోపాలకృష్ణ గోఖలేగారు ప్రజల అవి శ్వాసమునకు పాత్రుడు కాలేదు. హిందూదేశ స్వరాజ్యసిద్ధి కొఱకు తన జీవితమును అర్పించుటయే గాక ఇతరులను అట్టి సేవకు తయారు చేయుటకొఱకు "హిందూదేశ సేవక సంఘము"ను స్థాపించెను. ప్రజలెన్నుకొనగా ఢిల్లీ శాసన సభలో సభ్యుడాయెను. భారతదేశ ప్రభుత్వమువారి తరఫున ఆఫ్రికాకు హిందువుల కష్టములు నివర్తించుటకు నెటా లుప్రభుత్వమువారితో సంప్రతించుటకు వెళ్ళెను. ఇట్లు అతడు ప్రజలయు, ప్రభుత్వముయొక్కయు మన్ననకు సమముగా పాత్రుడుఆయెను.

ఆఫ్రికా సమస్యను గురించి పునహాలో ఉపన్యసించు టకు ఈ యిరువురు మహాపురుషులును అంగీక రించిరి.

తొలి చూపునందే ఆ మహా పురుషులలో భేదము ఆయనకు గోచరించి "లోకమాన్యతిలకు " మహాసము ద్రము." సముద్రములో దిగుట ఎట్లు భయమో అట్లు లోక మాన్యుడు కూడ సులభ గమ్యుడు కాడు" అనియు, గంగలో నిర్భయముగా దిగి ఎట్లు స్నానమును చేయుదుమో అట్లుగోపాలకృష్ణ గోఖలేతో చెలిమి చేయుట చాల సులభము అనియు ఆయన తలంచెను.

ఈ యిరువురును గాంధిజీ భక్తికి చాల పాత్రులైరి. లోక మాన్యుని మరణానంతరము తిలకు స్వరాజ్యనిధి అను పేర గాంధిజీ కోటిరూపాయలను వసూలుచేసి లోకమాన్యునియెడ గలి భక్తిని చూపెను. అట్లే గోఖలేగారు చనిపోవువఱకు ఆయనతో అపారమగు స్నేహముచేసి ఆయనకు గాంధిజీ చాల దగ్గఱమిత్రుడు ఆయెను.

లోకమాన్యునికడకు వెళ్లినప్పుడు ఆయన ప్రఫెసరు భండార్కరుగారిని దక్షిణాఫ్రికా సభకు అధ్యక్షునిగా చేయు డని చెప్పెను. అందుచే గాంధిజీ ఆయనను కూడ చూచుటకు వెళ్ళి దక్షిణాఫ్రికాసభకు అధ్యక్షత వహింపుడనికోరెను.

శ్రీరామకృష్ణ భండార్కరు భారతీయులందఱిప్రేమకు పాత్రుడగు గొప్ప సంస్కృత పండితుడు. సంస్కృత వ్యాక

రణ శాస్త్రవేత్త. చరిత్ర పరిశోధకుడు. ఆయన సులువుగా నేర్చుకొనుటకు వీలుఅగునట్లు బాలురకు తగిన సంస్కృత వ్యాకరణమును ఆంగ్ల భాషలో ప్రకటించెను. దానిని భండార్కరు వ్యాకరణము అందురు. దానిని హిందూదేశములో సర్వభాగములందును పఠించుచుందురు.

తిలకు పక్షమువారును, గోఖలేపక్షమువారును ఏకగ్రీవముగా కోరగా డాక్టరు భండార్కరుగారు పునహాలో జరిగిన దక్షిణాఫ్రికా దేశీయుల కష్టములను గురించి చర్చించు సభకు అధ్యక్షతను వహించి ఆసభను జయప్రదముగా ముగించెను.



## 21. మద్రాసు కలకత్తాల సంచారము

మద్రాసులో దక్షిణాఫ్రికా భారతీయుల కష్టములను గురించిన సభ బాగుగా జరిగెను. సభలోకల ఉత్సాహాము నకు మితిలేదు. గాంధిజీ అచ్చొత్తించిన దక్షిణాఫ్రికా భారతీయుల చరిత్రము వేలకొలంది ప్రతులు ఖర్చుపడెను. బాలసుందరమును, రక్షించిన మహాపురుషునిగా మద్రాసువారు గాంధిజీని ఇదివఱకే ఎఱిగియుండుటచే ఆయనను తమ ప్రేమ సముద్రములో ముంచివేసిరి.

తరువాత గాంధిజీ కలకత్తాకు వెడలెను. ఆరోజులలో సురేంద్రనాథబెనర్జీ వంగదేశమునకు మకుటములేనిరాజు.

ముప్పది నలుబది వేలమందికల మహాసభలలో ప్రతివానికిని వినపడునట్లు సింహగర్జనములతో గొప్ప ఉపన్యాసముల నీయగలవక్త. అమృతబజారు పత్రిక వంగదేశములోను బహుశః హిందూదేశములోను గొప్ప పత్రికలలో ఒకటి. ఆ పత్రికాధిపతిని సందర్శింపగా అతడు గాంధిజీని దేశదిమ్మరివిగా తలంచెను.

"వంగవాసి" ప్రసిద్ధికెక్కిన దినపత్రిక. అపత్రికాధిపతి గాంధిజీవంక కన్నెత్తియే చూడలేదు. గాంధిజీ పనికల్పించుకొని విషయమును చెప్పగా "నీవంటివారిక్కడ పెక్కురు. నీతోమాటాడుటకు నాకుతీరిక లేదు. మీరిచటినుండి వెళ్లిపోయినచో చాల సంతసము" అనెను. గాంధిజీకి కొంచెము విచారము కలిగెను. కాని పత్రికాధిపతుల బాధలు ఎఱిగినవాడు. అచ్చటికి పెక్కురు జనులు వచ్చుచు పోవుచుండుటచే సంపాదకునకు ఎంతమాత్రము తీరిక లేకయుండెను. అది చూచియుండుటచే ఏదో ఒక విధముగా సరిపెట్టుకొనెను.

ఇంగ్లీషుమన్, స్టేట్సుమన్ పత్రికాధిపతులతో మాట్లాడెను. వారు ఆంగ్లేయులు. వారుదక్షిణాఫ్రికా సమస్యయొక్క అర్థమును సంపూర్ణముగా గ్రహించి తోడుపడ వాగ్దానముచేసిరి.

అందు ఇంగ్లీషుమను పత్రికాధిపతిగారగు సాండర్సుగారు గాంధిజీ దక్షిణాఫ్రికా ఉద్యమమును గుఱించి ప్రధాన

వ్యాసమునుకూడ ఆయన అభిప్రాయములకు అనుగుణముగా వ్రాసి తోడ్పడెను. మఱియు తఱచుగా ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరములు చేయుచుండెను.

ఇట్లు కలకత్తాలో భారతీయ నాయకులనుండి తోడ్పాటు రాకున్నను ఆంగ్లేయులతోడ్పాటు సంపూర్ణముగా వచ్చెను. కలకత్తాలో సభ జరుపుటకు వీలుకలుగదని భావించుతఱిని అకస్మాత్తుగా ఆ ఇంగ్లీషుపత్రికాధిపతుల సాయము వచ్చుటచే త్వరలోనే సభచేయ నిశ్చయించెను. కాని ఇంతలో ఆఫ్రికాకు తిరిగి వెంటనే రావలయునను తంతివార్త వచ్చెను.

నెటాలునకు హఠాత్తుగా వెళ్లవలసి వచ్చుటచే కలకత్తా సభను జరుప వీలుకలుగలేదని ప్రకటించి దక్షిణాఫ్రికాలోని వర్తకులలో ప్రముఖుడగు దాదాఅబ్దుల్లాగారు క్రొత్తగా కొన్న "కుర్‌లేండు" అను స్టీమరులో కుటుంబముతోకూడ దక్షిణాఫ్రికాకు బయలుదేఱెను.

వారు గాంధిజీ దగ్గఱ ప్రయాణపు రుసుమును ఒక్కదమ్మిడీ నైనను పుచ్చుకొనకయే సర్వ సౌఖ్యములను కల్పించి ఆఫ్రికాకు తీసికొని వెళ్లుచుండిరి.

కుటుంబముతోకూడ సముద్రమువీద ప్రయాణముచేయుటకు ఇదే మొదటిసారి. స్టీమరులో వారికి సర్వ

సౌఖ్యములును కలవు. ఏలఅనగా గాంధిజీకి ఆ ఓడ యజమానియగు దాదా అబ్దుల్లాగారు గొప్పమిత్రుడు. ఖాతాదారు. అందుచే ఆస్టీమరు ఆయనకు, కుటుంబమువారికి సొంతయింటివలె ఉండెను.

చిరకాలమునుండి భార్యయొక్కయు బిడ్డలయొక్క యుక్షేమమును స్వయముగా చూచుటకు గాంధిజీకి అవకాశములేదు. మూడేండ్లు ఇంగ్లండులో ఉండెను. తరువాత బొంబాయిలో నాలుగైదు మాసములు గతించెను. పిమ్మట దక్షిణాఫ్రికా నివాసములో మఱిమూడు ఏండ్లు కడచెను. ఇట్లు చాలకాలము కుటుంబమునకు దూరములో ఉండుట పొసగెను.

ఇప్పటికి భార్యబిడ్డలు తాను ఒక్కచో ఉండుటకు వీలుకలిగెను. తాను కుటుంబముతో ఉన్నచో భార్యయగు కస్తూరిబాయికి చదువు నేర్పుటకు చాలవీలు కలిగెడిది.

బాల్యమునందే వివాహములు జరుగుచుండుటచే హిందువులలో స్త్రీలకు విద్య విశేషముగా ఉండదు. కస్తూరిబాయికికూడ చదువుకొలదియే. అందుచే ఆమెకుచదువు చెప్పవలయునను కోరిక గాంధిజీకి కలిగెను.

బిడ్డల విషయములోకూడ స్వయముగా దగ్గఱఉండి తగిన విద్యను చెప్పించుటకు ఇదివఱకు ఆయనకు అవ

కాశము కలుగలేదు మఱియు వారికేయే బట్టలు కావల యునో ఎట్టి భోజనములను ఏర్పాటు చేయవలయునో వానిని గుఱించి విచారించుటకు గాంధిజీకి వీలుకలుగలేదు.

ఆంగ్లేయుల వేషభాషలను వేయుటయే నాగరకతఅని ఆరోజులలో గాంధిజీకితోచెను. మఱియు అట్టి వేషమువలన పలుకుబడి హెచ్చుననియు అందుచే దేశసేవచేయుటకు వీలు కలుగుననియు ఆయనభావము.

కాని, కస్తురబాయికి ఆంగ్లదేశీయుల వేషము వేయుట అసహ్యముగా తోఁచెను. అందుచే ఆమెకు పారసీ పద్ధతికి అనుగుణములగు చీరెలు, బట్టలు సంపాదించి యిచ్చెను

పిల్లలకు బూటులు, మేజోళ్ళు, కోటులు, పంట్లములు తయారుచేయించెను. ఈక్రొత్త పద్ధతులు భార్యకు బిడ్డలకు మొదటరుచింపలేదు. బూటులవలన కాళ్ళు కఱచుకొనును సనియు వ్రేళ్ళు నొప్పియెత్తుననియు ఆక్షేపణలు చెప్పిరి. కాని గాంధిగారి బలవంతముచే ధరింపక తప్పలేదు.

హిందూధర్మము ప్రకారము భార్యకు పతియే దైవము. మఱి భర్తకు భార్యయో సేవకురాలు. గాంధిజీ దంపతులలో కూడ ఆరోజులలో ఆభావమేకలదు. అందుచే తనమాట ప్రకారము ఆమె విధిగా నడచుకొనవలయునని

ఆయన తలంచెను. ఆమెయు అట్లే ఆయన చెప్పిన వేషమునే ధరించెను.



## 22. తుపాను.

సంతోషముతో స్టీమరులో గాంధిజీ కుటుంబము వెళ్ళుచుండెను. అది దారిలో ఏరేవునందును ఆగక సరాసరి దక్షిణాఫ్రికాకు పోవుస్టీమరుఅగుటచే 18 రోజులలోనే డర్బను చేరును.

ఇంక నాలుగైదు రోజుల ప్రయాణముకలదు. అంతలో ఆనట్టనడి సముద్రమున తుపాను సూచనలు కనుపట్టెను. అది డిశెంబరు నెల. ఆహిందూమహాసముద్రములో డిసెంబరు వేసవికాలము. అయినను వర్షములుకూడ హెచ్చు. గంటలోవాన. గంటలోఎండ. మఱి తుపానులు తఱచు.

ఆచిన్నతుపాను గొప్పదాయెను. ఒకటి రెండురోజులు కడచెను. ఇంకను హెచ్చిపోయెను. తుదకు బ్రహ్మాండమగు తుపానుగా మాఱెను.

ఆ స్టీమరులోని జనులందరు భయముచే గడగడ లాడి పోవుచుండిరి. ఒకకెరటముక్రుంగె మఱొకకెరటము పెరిగి పోవుచుండెను. ఆకెరటముల పైకెక్కి మరల దిగునప్పుడు

ఆస్టీమరు అంతయు గాలిలో ఎగురుచున్న ట్లువలె కొట్టుకొను చుండెను. లోని జనమెల్ల గుండెలు బాదుకొనుచుండిరి.

రాత్రి నిద్దుర లేదు. ఎక్కడజూచినను జనులు దైవప్రార్థనములు చేయుచుండిరి, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు. తమతమ పవిత్రమత గ్రంథములను పఠించుచుండిరి.

ఒకొక్క గొప్పధ్వని వినపడుచున్నప్పుడెల్ల ప్రజలు గుండెలుకొట్టుకొనుచు "ఈసారితో స్టీమరు ముక్కలై పోవును. ఇక నిలువదు" అని చెప్పుకొనుచుండిరి. అట్టిసమయము లు పెక్కులు దాటెను. ఇంతలో బ్రహ్మాండమగు మ్రోతవినబడును. "తప్పక ఈసారి ఏదో ఒకమూల స్టీమరు పగిలిపోయినది. ఇఁకమనకు సముద్రమేదిక్కు" అని బాటసారులు నిశ్చయించుకొనుచుండిరి. అట్లు ఆస్టీమరు ఎగురుచు క్రిందికి పడుచు గొప్ప గొప్ప మ్రోతలు మ్రోయుచు ముందునకు పోవుచుండెను.

అలల ఊపులచే స్టీమరు ఊగులాడి బోరగిలబడిపోవునట్లు కన్పడుచుండును. అట్టి అలలు నిముస నిముసమునకు వచ్చుచుండెను. తుపాను యింకను కొట్టుచునేఉండెను.

మధ్యమధ్య కెప్టెనువచ్చి ఇంతకంటె పెద్దతుపానులుచూచితిని. పరవాలేదు. స్టీమరుగట్టిది అయినచో మనకే

భయమును లేదు. అని వారిని ఓదార్చుచుండెను. కాని ఫెళ్ళు మని ఒక్కొక్క పెద్దధ్వని వారి చెవులకు తాకి వారి ఆశలను అడుగంటించుచుండెను.

అందఱును "పరమేశ్వరుని అధీనము" అను మాటలనే పలుకుచుండిరి. ఎక్కడను వేఱుమాటకన్పడలేదు.

గాంధిజీ ఒక్కడే ఇట్టి ఘోరమగు విపత్తునందు లేశమేనిజంకలేదు. ఆయన ఇంచుకయు చలింపక పరమేశ్వరుని మీఁద భారమువైచి అట్టి తుపాను సమయములో కూడ సంతసముతో ఉండెను.

ఇంతలో తుపానుతగ్గెను. వానపోయెను. మబ్బులు విడెను. సూర్యుడు కన్పడెను. ఇఁకతుపాను భయములేదు అని కెప్టెను నవ్వుమోముతో నాలుగువైపులకును వెళ్ళి అందఱికిని సంతోషవార్తను చెప్పుచుండెను.

ఈశ్వరునికి కృతజ్ఞతను చెల్లించుకొనుటకు మరల నమాజులు, ప్రార్థనములు, పూజలు, భజనలు జరుగుచుండెను. కాని తుపాను సమయమునందుకల దీక్ష, భక్తి ఇప్పుడు లేవు.

తుపానుచే గాంధిజీకి ఆ ఓడలో పెక్కురితో మైత్రి కలిగెను. తుపాను లేనిచో బహుశః ఆయన తనగదినిదాటక ఉండెడివాడు. బాటసారులను ఓదార్చుటకు ఆయన నాలుగు

కడలకువెళ్ళి వారి దుఃఖమును తొలగించుచుండెను.

స్త్రీమరులు రెండును రేవుచేరెను. కాని, ఆ స్త్రీమరుల లోని ప్రతిమనుజుని పరీక్షించువఱకు వాని లోనివారినెవ్వ రిని దిగనీయరు. దిగుటకు వారికి అంగీకారము ఈయనంత వఱకు ఆ స్త్రీమరుమీాద "పచ్చజెండా" ను ఎత్తుదురు. దాని అర్థము ఆ స్త్రీమరులలోనివారు డాక్టరుపరీక్షలో ఉన్నారు అని అర్థము.

దారిలో ఎవరికేని అంటురోగము తగిలినచో వారిని "క్వారంటైను" అను భవనములో ఉంచుదురు. ఆపదమునకు "ఇతరులు వెళ్ళరాని గృహము" అని అర్థము.

బొంబాయిలో బయలుదేఱురోజున ఆ నగరములో ప్లేగు కలదు. ఇఱువదిమూడు రోజులవఱకు ప్లేగురోగచిహ్నా ములు కన్పడనిచో వారిలో ప్లేగుసూక్ష్మజీవులు లేవని అర్థము. అందుచే దారిలోగడచిన పదునెనిమిది రోజులుకాక మఱి అయిదురోజులు క్వారంటైనులో నివాసమును విధించిరి.

## 23. తెరచాటున కుట్రలు.

వారని నెటాలు ప్రవేశింపకుండ జేయుటకు క్వారంటైను నివాసము ఒక కారణము. కాని అంతికంటెమించిన కారణము కలదు. గాంధిజీని, ఆ స్త్రీమరులోని ఇతరులను ఆ దేశములో కాలుపెట్టకుండ చేయువలయునని అప్పటి తెల్లవారు బ్రహ్మాండ మగు ప్రయత్నము చేయుచుండిరి.

దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యల విషయమై ఇండియాలో గాంధిజీ చేసిన ప్రసంగములను గూర్చి చాల అసత్యములగు వార్తలు నెటాలునకుపాకెను. అందుచే గాంధి గారు ఇండియాలో నెటాలు తెల్లవారిని లెస్సగా దూషించి నట్లు తలంచిరి. మఱియు ఆయన హిందూదేశమునుండి చాలమంది నల్లవారిని తీసికొనివచ్చి నెటాలు దేశమును భారతీయులతో నింపివేయు చున్నాడను లేనిపోని వార్తలు ప్రబలెను. ఈరెండు స్టీమరులలోని యాత్రికులు గాంధిజీ తెచ్చినవారే అని వారు నమ్మిరి.

అందుచే నెటాలుదేశములోని తెల్లవారికి చాల కోపమువచ్చెను. కనుక ఆఓడలలోనివారిని నెటాలులో కాలు పెట్టకుండఁజేయవలయునని తలంచిరి.

అందుకొఱకు అచ్చటి తెల్లవారు డర్బనులో పెద్ద పెద్ద సభలుచేసి గాంధిజీని దూషించిరి. ఆస్టీమరుల అధి కారియగు దాదా అబ్దుల్లాగారిని భయపెట్టిరి. ఆయన జంకకుండుటచే మఱల కొంత సౌమ్యభావమును చూపిరి. ఎట్లు అయినను గాంధిజీని ఆరెండుస్టీమరులలోనివారిని తిరిగి పంపివేయుటకు నెటాలులోని తెల్లవారు నిశ్చయించి కర్తవ్యమును ఆలోచించుచుండిరి.

ప్లేగురోగమును రాకుండ జేయుటకొఱకు క్వారంటైనులో ఉంచితిమనుట పైకిచెప్పిన మాటలు. కాని తెల్లవారి అంత రంగికోద్దేశము గాంధిజీని ఆస్టీమరులోని భారతీయులను నెటా లులో కాలు పెట్టకుండ చేయవలయుననియే.

కాని తెరచాటున కుట్రలు జరుగుచుండెను. నెటాలు గవర్నమెంటు జోక్యము కలిగించుకొని ఆ స్టీమరులలోనివారిని దేశములో కాలుపెట్టరాదని అడ్డుపెట్టదలంచినను వీలు లేదు. ఏలననగా ఆ యాత్రికులు, శాంతులు. ఆయుధములు లేవు. పోరాడవచ్చిన విదేశీయులు కారు. బ్రిటిషు సామ్రాజ్యవాసులు.

యాత్రికులు రాజభక్తికలవారు. గాంధిజీ రాజద్రోహము చేసెనని ఆరోపించుదమా అనిన దానికిని ఎట్టి ఆధారమును కానరాదు. ఆయన శాంతుడగు రాజభక్తుడు. అందుచే ప్రభుత్వము ప్రత్యక్షముగా జోక్యము కలిగించుకొనుటకు హేతువు లేదు.

కాని నెటాలు తెల్లవారిని ఇండియా దేశములో గాంధిజీ దూషించిరను చెడువార్తలచే ఆ దేశపు తెల్లవారికి ఆయనపై పగ కలదు. అందుచే ఆయనను, ఆయన తీసికొని వచ్చుచున్న మనుష్యులని తలంచిన ఆ యాత్రికులను రానిచ్చుటక వారికి ఇష్టము లేదు.

అందుచే వారు ఆ ఓడ యజమానియగు దాద అబ్దుల్లాగారిని ఈ అయిదురోజులలోగా లోబఱచుకొని కా మును సాధింప నిశ్చయించి వారిని తిరిగి భారతదేశమున పంపనిచో ఆయనకు గొప్పహాని కలిగించెదమని బెదరించి ఆయన భయపడలేదు. ఆ యాత్రికులను నెటాలులో దిం తప్పదు అని దాదాజీ పట్టుపట్టెను.

అందుచే రాకపోకలకు ఆ యాత్రికులకు అయిన స్టీమరు ఖర్చులను ఇతరవ్యయములను ముదరా ఇచ్చెదమని తెల్లవారు సామదానములను ప్రయోగించిరి.

అట్టి బేరమువలన ఆ కంపెనీవారికి లాభము రావచ్చును. కాని, అది ఎంతమంది యాత్రికులకో కష్టమును కలిగించును. అచ్చటి తెల్లవారు అనుకొనుచున్నట్లు వారిని గాంధిజీతీసికొని రాలేదు. అది ఆ కంపెనీవారికి తెలియును. ఆయాత్రికులు ఏయే పనులమీద ఎచ్చటెచ్చటికి పోవుదురో? అట్టివారిని తిరిగి భారతభూమికి పంపుటెట్లు?

కాని, ఆ డర్బను నగరములో బలవంతులగు తెల్ల వారికి వ్యతిరేకములగు పనిని చేయుటలో చాల కష్టములు లవు. వారిని నెటాలు దేశములోనికి రానిచ్చుట వర్నమెంటువారికికూడ ఇష్టములేదు. దాదాఅబ్దుల్లాకంపెనీ వారికి ప్రభుత్వమువారితో ఎప్పుడును పనులు పెక్కులు ఉండు ండును.

ఇట్లు కంపెనీవారిపని ఒకప్రక్క నూయి ఒకప్రక్క యి అనునట్లు ఉండెను. అయినను దేవునిపైని భారమును చి అబ్దుల్లాకంపెనీవారు ఎన్నికష్టములు వచ్చినను ఎంత ష్టము వచ్చినను ఆయాత్రికులను తిరిగి భారతి భూమికి కొని వెళ్లుటకు సమ్మతింపలేదు.

## 24. గాంధిజీ అహింసా ప్రయోగ నిశ్చయము.

గాంధిజీకూడ చాల సంధిగ్ధ స్థితిలో ఉండెను. విషయ అంతయు ఆయనకు అర్థము ఆయెను. అచ్చటి తెల్లవారికి కోపము అంతయు తనమీదనేఅని ఆయన ఎఱిగెను.

తనవలన దాదాఅబ్దుల్లా కంపెనీవారికి చాలనష్టము రావచ్చును. అట్లని తానుఇండియాకు మరలుట అసంభవము. నెటాలు దేశములోదిగి జీవించుటకు ప్రతి భారతీయునకు హక్కు కలదు. అట్టిహక్కును వదలుకొని తిరిగ భారత భూమికి వెళ్లుటచాల నీచకార్యము. అట్లు తాను చేయుచో ఆతెల్లవారు అస్టీమరులలోని వారినందఱిని తిరిగి వంపుదురు.

గాంధిగారు కర్తవ్యమును నిర్ణయించుకొనిరి. తనకును తనకుటుంబముకును ప్రాణాపాయముకలదు. దాదాఅబ్దుల్లా గారికికూడ గొప్పకష్టములు కలవు.

కాని ఆయన సంపూర్ణముగా నిర్దోషి. ఆఓడలోని వందలకొలది యాత్రికులలో ఒక్కనినికూడ ఆయన తీసికొనిరాలేదు. ఒకరిద్దని తప్ప ఇతరులను ఎఱుగఁడు.

ఇండియా దేశములో ఇచ్చిన ఉపన్యాసములలో ఎందుకాని నెటాలులోని తెల్లవారిని దూషింపలేదు. అందు లకు ప్రబల సాక్ష్యము కలదు. మెహతాగారి మంచి సల హాచే ఆయన ఉపన్యాసములను అచ్చొత్తించి చదివెను. పత్రికలలో పడిన నిజమగు రిపోర్టులుకూడ కలవు.

కాని, వీని నన్నిటిని వినుటకు, తెలిసికొనుటకు ఆయు నను ద్వేషించుచున్న తెల్లవారికి శాంతము లేదు. వారు స్టీమరునుండి దిగి వెళ్ళునప్పుడు ఆయనను కొట్టవలయుననియే తలంచుచుండిరి.

స్టీమరులో ఒక చిన్న సభ జరిగెను. అందు ఆయన తనను తెల్లవారు ఎంత హింసచేసినను ఆ హింసను అహిం సతో క్షమించెదనని పలికెను.

"తెల్లవారు మిమ్ములను కొట్టినచో మీరు మీ అహింసాతత్వమును ఎట్లు ఆచరణలో ఉంచెదరు?" అని ఆ"కుర్ లెండు" స్టీమరు కెప్టెన్ ప్రశ్నించెను.

"నన్ను కొట్టినను తిట్టినను వారిపైని కేసు పెట్టను. వారిదౌర్జన్యమును సహించి వారిని సంపూర్తిగా క్షమింపగల శక్తిని భగవంతుడు నాకు ఇచ్చునని నమ్మెదను" అని జవాబు చెప్పెను.

కెప్టెన్ గారును అచ్చట జేరిన ఇతరులును నవ్విరి. హింసను అహింసచే క్షమించుట అననేమో వారికి అర్థము కాలేదు. కాని గాంధిజీ శాంతముతో అహింసతో వారు ఏమిచేసినను అనుభవింప నిశ్చయించెను. కాని ప్రాణభీతిచే దక్షిణాఫ్రికాను విడిచి భారతభూమికి తిరిగి రావలయుననే భావమును కలలో కూడతలంపలేదు.

ఇంతలో అయిదు రోజులును కడచినవి. ఇంకెంతకాలము క్వారంటైను గృహములో ఉంవగలరు? అందుచే ఆ తెల్లవారు విధిలేక అసమ్మతితో పచ్చజెండాను తొలగించి పట్టణములోని వారుఓడ లోనికి రావచ్చునని యు, స్టీమరు లోనివారు డర్బనులోనికి వెళ్లవచ్చుననియు ప్రకటించిరి. బాటసారులు స్టీమరులనుండిదిగి తమ నెలవులకు పోవజొచ్చిరి.

గాంధిజీకి రాబోవు ఆపదను గురించి ముందటి భాగ "ములో చదువుదము.


